# అర్చావతారము

[ మూర్తిపూజ ]

ఇది

భగవంతుని యవతార విశేషములును, ఋషినిర్మితములును

అగు

శ్రీ విగ్రహముల స్వరూప ప్రభావ మహత్త్వములను
వైజ్ఞానిక పద్ధతిని

పండిత పామరులకు హృదయంగమ మగురీతిని

నిరూపించిన అమూల్య గ్రంథము.

"శ్లో॥ యోయో యాంయాం తనుం భక్తః శ్రద్ధయార్చితు మిచ్ఛతి
తస్యతస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్."

— భగవద్గీతలు 7—21


రచయిత:

యల్లాపంతుల జగన్నాథం, బి, ఏ.,



పబ్లిషర్సు:

వేంకట్రామా అండ్ కో.,

బెజవాడ - మద్రాసు.

1948




[వెల రు 1—0—0

"అవధాని శిరోమణి", "మహోపాధ్యాయ", "కళాప్రపూర్ణ" ప్రభృతి వివిధ సద్బిరుదాలంకృతులును, సూరిజన పంచాననులును, నిరంతర భగవచ్చింతనులును అగు

శ్రీ కాశీ కృష్ణాచార్యుల వా రనుగ్రహించిన

# ఆ శ య ము.

శ్రీ లక్ష్మీ హయగ్రీవో విజయతే తరామ్.

"ఉపదేశక, భక్తితిల" కోపాధియుతులగు బ్రహ్మశ్రీ యల్లాపంతుల జగన్నాథము పంతులు బి. ఏ., గారిచే విరచిత మగు "అర్చావతారము (మూర్తిపూజ)" అను నీగ్రంథమును కవి ముఖతః ప్రత్యక్షర పరిశీలనముతో సాంగోపాంగముగా వింటిని. మతత్రయోద్ధారకులచే ప్రాణుల కందఱకు తరణోపాయముగా నుపదేశింపఁబడిన భక్తిసాధనములలో నుత్తమోత్తమమగు మూర్తి పూజనమును గూర్చి చక్కని వివరణముతో నీ గ్రంథమును వీరు ప్రమాణ పురస్సరముగా వ్రాసిరి. వీరికి హూణభాషయందు గూడ విశేష పాండిత్యముండుటచే పండిత పామరుల కందఱకు హృదయంగమ మగునట్లు వివరింపఁ గలిగిరని నా యాశయము. ఈ గ్రంథము విద్యార్థులకు పఠన పాఠనములలో వినియోగించినచో చిన్నతనమునందే వారి శుద్ధ హృదయములయందు భగవద్భక్తి హత్తుకొని వారి పురోభివృద్ధికి దోహదము కాఁ గలదు. వీరింకను నిట్టి యుత్తమగ్రంథములను విరచించి భారతదేశమునకు మహోపకారము చేయుదురు గాత యని శ్రీ హయగ్రీవ మూర్తిని ధ్యానించుచున్నాను.

ఏలూరు,
12 జనవరి 1947.

కాశీ కృష్ణః.

శ్రీ

# గురు ప్రణతి

శ్లో॥ శ్రీ విగ్రహారాధన నిత్యనానా
శృంగార తన్మందిర మార్జనాది
యుక్తస్య భక్తాంశ్చ నియుంజతోఽపి
వందే గురోః శ్రీచరణారవిందమ్.

# విషయ సూచిక

పుట.

# ప్రథమ ముద్రణమునకు పీఠిక.

1944 సంవత్సరాంతమున నేను మద్రాసు కార్పొరేషను వారి యుద్యోగమునుండి విరమించిన వెనుక మద్రాసు హిందూధర్మాదాయముల బోర్డు వారు నన్ను తమ బోర్డుతరఫున హిందూమత ప్రచారకునిగ నియమించుటచే పదునైదు మాసములు గుంటూరు మండలమందును, అందు మూఁడు మాసములు పశ్చిమగోదావరీ మండలమందును, నే ననేక దేవాలయములను దర్శించిన సందర్భమున పలువురు ధర్మకర్తల యొక్కయు, అర్చకుల యొక్కయు పరిచయభాగ్యము నాకు లభించెను. తమ యధికారుల యుత్తరువులకు లోఁబడి వారలొనరించు దేవాలయ కార్యనిర్వహణమందు లౌకిక వాతావరణమే నాకుఁ గనుపించెను. గాని పారమార్థికమగు సేవాగ్రహము నాకంతగా గోచరింపలేదు. అందువలన నా మనస్సునకుఁ జాల విషాదము కలిగెను. తమసేవ నాకాంక్షించు దేవతామూర్తుల యందుకంటె తమ యధికారుల యెడల వారలధిక శ్రద్ధాభక్తులు చూపుచుండిరి. లౌకికముగ నిది సమంజసమే. కాని దేవాలయము లందలి భగవన్మూర్తులతోఁ దమకుఁగల సంబంధమెట్టిదో, దారుశిలాది మూర్తులయెడల తమ రెట్టి భావన చేయవలయునని శాస్త్రము విధించెనో, తాము చేయు పూజన మెప్పుడును పౌత్తలికతకు సంబంధించినది కాకుండునో, శ్రీ విగ్రహపూజకు ఫలదాత యెవఁడో, దేవాలయ నిర్మాణక్రమ మెట్టిదో, అందలి వివిధపరికరము లెట్టి యంతరార్థములు గలవిగ ఋషులు నిర్ణయించిరో, దేవాలయ కార్యనిర్వహణ రహస్యమెట్టిదో, భగవన్మూర్తిని సేవించుకాలమున నెట్టి యపరాధము లొనరింపరాదో మున్నగు మూర్తిపూజకు సంబంధించిన యనేక విషయములు ధర్మకర్తలుగాని, అర్చకులుగాని చాలమంది యెఱుఁగనే యెఱుఁగరు. ధర్మాదాయముల బోర్డునందలి యధికారులు దేవాలయముల సొత్తులను, ఆదాయములను తమ క్రింది ధర్మకర్తలును, అర్చకులును స్వవినియోగము చేయకుండునట్లు మాత్రము తగిన నిబంధనల నేర్పఱచినట్లు తోఁచుచున్నది. కాని మన ఋషు లేర్పఱచిన దేవాలయ సంస్థయొక్క ఆధ్యాత్మిక ప్రభావము కాపాడుటకు వలయు నిబంధనలుగాని, సారస్వతమునుగాని ప్రకటించినట్లు తోఁచదు. మతప్రచారమును గూడ నిటీవల నిలిపి వైచిరి. కావున ఆస్తికత తక్కువగల ధర్మకర్తలకును, అర్చకులకును దేవాలయ తత్త్వజ్ఞాన వికాసము లేకుండుటచే అర్చామూర్తులయందలి భక్తి ప్రపత్తులు వారికి సహజముగఁ గొఱత పడుచున్నవి. ఈస్థితి బహు శోచనీయమైనది.

ఏలయన, వారుతమసంసార కార్యనిర్వహణమువలెనే దేవాలయ కార్యనిర్వహణమునుకూడ బహిర్ముఖవృత్తితో చేయుచుండుట వలన దేవాలయ ప్రేక్షకులకు భక్తిని పెంపొందింపజాలకుండు టట్లుండ, తమ ఆచరణమే ప్రేక్షకులకు ప్రామాణికముగ ప్రమాణమగుటచేత శ్రీమూర్తులందు ప్రేక్షకులకు గల రజస్తమో రూపజ్ఞానము సాత్త్వికజ్ఞాన రూపము వహించుట కవకాశము లేక వారలు భక్తిరహితులును, ఒకప్పుడు నాస్తికులును అయ్యెడి ప్రమాదస్థితి తటస్థించుట కవకాశము కలుగుచున్నది.

దేవాలయముల సర్వవ్యవహార నిర్వహణమును దొరతనము వారిదగుటచే శ్రీ విగ్రహారాధన మహత్త్వము వైజ్ఞానిక పద్ధతిని దేవాలయ కార్యనిర్వాహకులకును, దేవాలయ ప్రేక్షకులకును బోధింపగల బాధ్యత దొరతనము వారిదగుటయే యుక్తము. మన మద్రాసు దొరతనమువారు దేవాదాయముల సద్వినియోగము కొఱకు ప్రత్యేకముగ నొక మంత్రివర్యునే యేర్పఱచిరి. వారు తాము స్వయముగనో, బోర్డువారి మూలముననో ఈ పవిత్ర కార్యము జరిపించియే తీరవలెనని నామనవి. దారువులకును, శిలలకును సర్వాగ్రహారములును, అమూల్య వస్త్రాభరణములును, లక్షలు నిలువగల సుందరాలయములను సమర్పించు నున్మత్తులును, మందబుద్ధులును మన భారతదేశ మందింతవఱకు పుట్టలేదు. అర్చామూర్తుల యందలి భగవద్భావము ప్రేక్షకులయందు వృద్ధి బొందవలయునను సదభిప్రాయము లేనియెడల శ్రీ గాంధిమహాత్ముని వంటి మహాసాధు పురుషుడు హరిజనుల దేవాలయ ప్రవేశము గుఱించి పట్టుదల వహించువాడు కాడు. దేవాలయ ప్రవేశము మహాత్ముని దృష్టియందు మహాపవిత్రమగు నాధ్యాత్మిక విషయముగాక కేవల సాంఘిక విషయమే అయినచో సవర్ణ హిందువులయం దంతర్భాగమే అయిన హరిజన సంఘమునకు వారితో సర్వసమానత్వము పునఃస్థాపన మొనర్చుటకు హిందువుల యిండ్లయందును, భోజన వసతిగృహములందును, అల్పాహార మందిరములు మున్నగువాని యందును హరిజనులకు ప్రవేశము కలిగించుటతో మహాత్ముడు తృప్తినొందియే యుండును. ఇతర ప్రేక్షకులతో పాటు హరిజనులకుగూడ అర్చామూర్తులయందు భగవద్భావమును, భక్తియును పెంపొందించుట ముఖ్యవిషయము కాని యెడల వారల దేవాలయ ప్రవేశోద్యమము సాంఘికము, లౌకికము మాత్రమే యగును కదా? భక్తి పూర్తిగ నశించుటచే సవర్ణహిందువులే దేవాలయములకు బోవుట మానుకొన్నప్పుడు హరిజనులుకూడ "క్రొత్తప్రియము; వేడి రుచి" యను సామెతకు లోబడి అచిరకాలములోనే దేవాలయములను మఱచుటకు పూర్తిగ నవకాశము

కలదు. కావున హరిజనుల ఆధ్యాత్మికోన్నతిమైన దృష్టియందిడుకొని దొరతనమువారు దేవాలయ సంస్థ మహాపవిత్రతను, మాహాత్మ్యమును వారికి బోధింపఁగల సారస్వతము నాదరించుటయు, ప్రకటించుటయు నత్యావశ్యకమని మనవి చేయుచున్నాను.

నేను రచించిన యీ "అర్చావతారము (మూర్తిపూజ)" అనెడి గ్రంథముయొక్క ప్రాశస్త్యము ఆంధ్ర విశ్వవిద్యాలయము వారి వలనను, కవిపండిత సభలయందును "కళాప్రపూర్ణ", "మహోపాధ్యాయ", "అవధాని శిరోమణి" మున్నగు సద్బిరుదము లంది సదాచారము నందును, సర్వతోముఖ పాండిత్యము నందును ఆంధ్రదేశమున సత్కీర్తి గడించిన గుంటూరు పుర వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ, కాశీ కృష్ణమాచార్యులవారు వారి కనుగ్రహించిన "ఆశయము" నందుఁ దెలిపి యున్నారు. ఈ గ్రంథమును వారు "ప్రత్యక్షర పరిశీలనము" చేసిరి. నే నీ గ్రంథమును "ప్రమాణ పురస్సరముగా వ్రాసితి" ననిరి. ఇందలి విషయములు "పండిత పామరుల కందఱకు హృదయంగమ మగునట్లు వివరింపఁ గలిగితి" ననిరి. మఱియొక విషయము. 1939 సంవత్సరమందు నే నీ గ్రంథముయొక్క సంక్షిప్తసార మాంగ్లేయ భాషలో వ్యాస రూపమున నుత్తర హిందూస్థానమునుండి వెలువడుచున్న "కళ్యాణ కల్పతరు" వనెడి వేదాంత పత్రికకుఁ బంపగా వారు తమ ఆంగ్లేయ పత్రికయందే కాక దానిని భాషాంతరీకరణ మొనర్చి "కళ్యాణ్" అను తమ హిందూస్థానీ పత్రికయందును ప్రకటించి దాని ప్రాశస్త్యమును వెల్లడించిరి. కావున నీ గ్రంథము సర్వజనోపయోగముగ నుండునని నేను నమ్ముచున్నాను. ముఖ్యముగ బిడ్డల హృదయములు ధౌత వస్త్రములవలె శుద్ధముగ నుండును. కావున శ్రీ ఆచార్యులవారు తమ ఆశయమునందు సెలవిచ్చిన విధముగ "ఈ గ్రంథము విద్యార్థులకు పఠన పాఠనములలో వినియోగించినచో చిన్నతనమునందే వారి శుద్ధ హృదయము లందు భగవద్భక్తి నాటుకొని వారి పురోభివృద్ధికి దోహదము కాఁగలదు." "కౌమార ఆచరేత్ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతానిహ" అను శ్రీ వేదవ్యాస వచనమే వారిచట స్మరించినట్లు తోఁచుచున్నది.

మన దొరతనము వారు సంకల్పించుచుండిన నూత్న విద్యాప్రణాళిక యందు ఆధ్యాత్మిక విద్యకు ప్రాముఖ్యత నొసంగఁబూనుట మన మెఱిఁగిన విషయమే కనుక నిట్టి గ్రంథములను పఠనపాఠనములుగ నియమించుట కవకాశము గలదు. కావున నీ గ్రంథమును దేవాలయ కార్యనిర్వాహకులును, వారి మూలమున ప్రేక్షకులును చదివి అర్చామూర్తులందు వారు యథార్థ

భక్తులగు నట్లొనర్చుఁ డని దేవాలయశాఖా మంత్రిసత్తములను, దీనిని పఠన పాఠన గ్రంథముగ నిర్ణయించి విద్యార్థులకు మహోపకార మొనర్చుఁ డని విద్యాశాఖా మంత్రిసత్తములను సవినయముగఁ బ్రార్థించుచున్నాను.

వయోవృద్ధు లగుటచే నోపికయు, నిరంతర భగవచ్చింతను లగుటచేఁ దీరికయు బొత్తుగ లేకున్నను, నాయందలి ప్రేమచే నా యీ గ్రంథమును "సాంగోపాంగముగ" వినియు, చదివియు తమ సహజ సరళభావముతో దీని కమూల్యమగు నాశయము ననుగ్రహించిన శ్రీ కృష్ణమాచార్యులవారికి నే నాశీర్వాద పాత్రుఁడను. వారికి నా వందనసుమముల నర్పించు కొనుచున్నాఁడను.

ఏలూరు,
25—1—47.

యల్లాప్రంతుల జగన్నాథం, బి. ఎ.,

---

# ద్వితీయ ముద్రణమునకు పీఠిక.

---

ఆర్చామూర్తుల స్వరూప ప్రభావ మహత్త్వ నిరూపణముతో పాటు భగవత్తత్త్వ నిరూపణమును, జ్ఞానయోగ, ధ్యానయోగ, భక్తియోగ లక్షణములు, భక్తిశాస్త్రము యొక్క మూలసూత్ర వివరణమును ఈ గ్రంథమునఁ జక్కగ విపులీకరింపఁబడుట చేతను, మద్రాసు హిందూధర్మాదాయముల బోర్డు ప్రెసిడెంటుగారు ఆంధ్రమండలము నందలి దేవాలయ కార్యనిర్వాహకులు దీనినిఁ జదువునట్లు ఇటీవల ఉత్తరు విడుటచేతను, చదువరులకు ఇది ఆదర ప్రాయమై రెండవసారి ముద్రింప బడుచున్నది. స్వతంత్ర భారతదేశమందలి విద్యార్థులు ఆస్తికులును, ఋజువర్తనులును అగుటకు ఈ గ్రంథము తోడ్పడు నని తెలిసి వారల పఠనపాఠనములలో విద్యాధికారులు దీనినిఁ జేర్పుట శ్రేయస్కరము. వైజ్ఞానిక పద్ధతి వ్రాయబడిన ఈ గ్రంథము నాంధ్రదేశమం దాబాల గోపాలము పఠించి దారుశిలా నిర్మితములగు శ్రీ విగ్రహములం దాదరబుద్ధికలవా రగుదురు గాక !

ఏలూరు,
15—9—48.

యల్లాప్రంతుల జగన్నాథం, బి. ఎ.,

# అర్చావతారము

## [మూర్తి పూజ]

సోదరా! తన అనంత కిరణములతో నిండు నిప్పులు వెలుఁగుచున్న ఆ సూర్యుని జూచి భౌతిక సూర్యుఁడు తివా! మన పూర్వులీతనిని జగత్తునకు వెలుఁగు, వేఁడిమి నొసంగు నొక మహత్తర 'జ్యోతిష్పదార్థముగ మాత్రము భావింపక కేవల భగవద్భావముతోఁ బూజించుచుండిరి. నేఁటికిఁగూడ భారతీయుఁడగువాఁడు, ముఖ్యముగ, హైందవుఁడు త్రిసంధ్యాలం, దనఁగా, ఉదయ మధ్యాహ్న సాయాహ్న సంధ్యాకాలము లందు దోసిటఁ బుష్పములును, జలమును తీసికొని భక్త్యావేశముతో, "త్రిలోకములకుఁ దండ్రివగు నో ప్రభూ! నిన్ను నే నాశ్రయించుచున్నాను. మాబుద్ధులను భగవన్మార్గమునఁ బ్రవర్తింపఁజేయుగల నీమహా తేజస్సును ధ్యానింపు చున్నాను" అని ప్రార్థించు చుండును.

జగత్తునకు నేత్రము వంటివాఁడును, ప్రాణతుల్యుఁడును అగు ఈ సూర్యుఁడు ఆత్మతత్త్వము యొక్క బహిస్స్వరూపుఁ డగు చున్నాఁడు. ఈ సూర్యమండల నిర్మాణక్రమము కొంచె మాలోచింతము. మధ్య జ్యోతిర్మయమగు నొక గోళము, దాని ననుసరించి దిగంత విశ్రాంతములగు అనంతకిరణములు; ఇంతేకాదు! అనంతత్వమే స్వభావముగా గలిగినట్లు తోఁచెడి తత్కిరణ ప్రకాశార్ణవము సందలి ప్రత్యణువునందును తత్ప్రకాశమున కాశ్రయమై ససీమగ దోఁచెడ దాని నడిమిగోళము యొక్క ప్రతిమూర్తి సదా విరాజమాన మగుచుండును. విజ్ఞాన

వేత్తలే విషయ మెఱిఁగియేయున్నారు. దీనినిపట్టి సూర్యతత్త్వ నిర్మాణమందు నడిమిగోళము, తత్ప్రకాశసముద్రము, ప్రకాశ సంబంధమగు ప్రత్యణువునందును గోళముయొక్క ప్రతిబింబము, అను మూఁడు భాగములున్నట్లు మనకు స్పష్టమగుచున్నది.

చిత్సూర్యుఁడు, అద్వయజ్ఞాన తత్త్వము

ఇది సృష్టియందలి సూర్యుని విషయము. సృష్టి కతీతుఁడును, సృష్టిస్థితిలయములకుఁ గారణభూతుఁడును అగు చిత్సూర్యుని విషయ మిపుడాలోచింతము. ససీమ గను, రూపవంతముగను తోఁచెడి భౌతిక సూర్యుని నడిమి గోళమువలె చిన్మయమూర్తియగు సూర్యునకుఁగూడ మధ్యమాకారము, కళ్యాణతమ మగు రూపము కలదు. భౌతిక సూర్యుని కిరణప్రకాశము వలె మధ్యమాకృతి నాశ్రయించిన అనంత చిత్ప్రకాశము కలదు. భౌతిక సూర్యుని కిరణ ప్రకాశముయొక్క ప్రత్యణువునందును నడిమిగోళముయొక్క ప్రతిరూపము అనుప్రవేశ మొనర్చి నట్లు చిత్సూర్యుని యనంతచిత్ప్రకాశము నందలి ప్రత్యణువు నందును తత్ప్రకాశమధ్యవర్తి యగు కళ్యాణతమమూర్తి అనుప్రవేశ మొనర్చియున్నాఁడు. ఇది ఆత్మతత్త్వ వివరణము.

భౌతికసూర్యుని నిర్దేశించినపుడు నడిమిగోళమునుగాని, దాని నాశ్రయించిన కిరణప్రకాశమునుగాని, తత్కిరణ ప్రకాశము యొక్క ప్రత్యణువు నందును అనుప్రవేశ మొనర్చిన నడిమిగోళముయొక్క ప్రతిచ్ఛాయనుగాని వేఱువేఱుగ అన్నిఁటిని కలిపియే సూర్యునిగా మన మెట్లు భావింపుచున్నామో, చిత్సూర్యమండలమగు ఆత్మతత్త్వమును నిర్దేశించినపుడు కూడ నడమికళ్యాణతమ మూర్తినిగాని, దాని

నాశ్రయించిన అనంత చిత్ప్రకాశమునుగాని, తత్ప్రకాశము నందలి ప్రత్యేకరూపము పొందియున్న తత్త్వమూర్తిని గాని వేఱువేఱుపక అన్నిటిని కలిపియే ఆత్మతత్త్వముగా తత్త్వ వేత్తలు చెప్పియున్నారు. ఈ ఆత్మతత్త్వమునొక్క చిత్ప్ర కాశమును "బ్రహ్మ" అనియు, చిత్ప్రకాశమునందలి ప్రతి మూర్తులను "పరమాత్మ (లేక ఈశ్వరుడు)" అనియు, నవిమి కళ్యాణతమమూర్తిని 'భగవాన్' అనియు, జెప్పవచ్చును. కాని ఆ మూటికి అవినాభావ సంబంధమే కలదు. కనుక "బ్రహ్మ" యని చెప్పినపుడు పరమాత్మజ్ఞాన భగవద్జ్ఞానపరిచయమును, "పరమాత్మ" అని చెప్పినపుడు బ్రహ్మజ్ఞాన భగవద్జ్ఞాన పరి చయమును, "భగవాన్" అని చెప్పినపుడు బ్రహ్మజ్ఞాన పర మాత్మజ్ఞానపరిచయమును, సహజముగా గలుగవలసియుండును. ఏలయన, ఆత్మతత్త్వము ఏకమాత్ర వస్తువగుచు అవిభాజ్యమే అగుచున్నది. కేవల చిత్ప్రకాశజ్ఞానమును, తదంతర్గత కేవల కళ్యాణతమమూర్తిజ్ఞానమును, కేవల చిత్ప్రతిరూప జ్ఞానమును, ఖండజ్ఞానములే అగుచున్నవి. కాని ఆత్మతత్త్వము అద్వయజ్ఞాన తత్త్వమనియే తత్త్వవేత్తలు మనకు జెప్పిరి. కావున, అద్వయజ్ఞాన తత్త్వమునకే బ్రహ్మ, పరమాత్మ, భగవానను మూడునామ ములు వారిడిరి.

కృష్ణతత్త్వము-బ్రహ్మ, పరమాత్మ, భగవాన్

నైమిశారణ్య వాసులగు మునులు ఈ అద్వయజ్ఞాన తత్త్వమునకు "కృష్ణ" నామధేయ మిడిరి. నిర్మల ప్రేమస్థితినే కృష్ణశబ్దము నిరూపించును. ప్రేమ ఆకర్షించునంత బలవత్తరముగా ప్రపంచమునందే వస్తు వును వేఱొక వస్తువు నాకర్షింపదు

జాలదు కదా ? కావున కృష్ణుఁడను నాకర్షించు నిర్మల ప్రేమస్థితి యనియే తేలుచున్నది. కృష్ణుఁడే అద్వయ జ్ఞానతత్త్వమగుచు మధ్యమాకృతిగల కళ్యాణతమ మూర్తియై సనీమయగు చిన్మయరూపము గలిగి సాకారుఁడై దర్శన సులభుఁడగు చున్నాఁడు. తన్మూర్తి నిర్గత చిత్ప్రకాశ వ్యాప్తిచే అతఁడు అనంతుఁడును, నిరాకారుఁడును, సుదుర్దర్శ్యుఁడును అగు చున్నాఁడు. సాకారుఁడును, దర్శనసులభుఁడును అగునపుడు అతనిని కృష్ణభగవానుఁడనియు, నిరాకారుఁడును, సుదుర్దర్శ్యుఁడు నగునపుడు అతనిని కృష్ణబ్రహ్మమనియు పెద్దలు చెప్పుదురు. మఱియు నతఁడే అణువుకంటె నణువై చిత్ప్రకాశాంతర్వర్తి యగునపుడు కృష్ణపరమాత్మ అగుచున్నాఁడు. కావున ఆత్మతత్త్వమగు శ్రీకృష్ణునియందే చిన్మయ సాకార నిరాకారత్వములును, మధ్యమాకారానంతత్వములును యుగపద్ధర్మమున సమంజసత నొందుచున్నవి. ఆత్మతత్త్వమును ఈ విధముగఁ దెలిసికొని నప్పుడే బ్రహ్మ పరమాత్మ భగవచ్ఛబ్దములందు శబ్దభేదమే కాని అవి ఒక్క వస్తువునే నిర్దేశించు చున్నవని మనము తెలిసికొను చున్నాము.

జ్ఞానమార్గ, యోగమార్గ భక్తిమార్గములది సమగ్ర జ్ఞానమే.

బ్రహ్మ పరమాత్మ భగవద్జ్ఞాన సముచ్చయమే సంపూర్ణ జ్ఞానమగుచున్నది, కావుననే బ్రహ్మ (జ్ఞాన) నిష్ఠులై "నిమిషార్థం నతిష్ఠంతి వృత్తిం బ్రహ్మమయీం వినా" బ్రహ్మాకార వృత్తియందు తప్ప వేఱొక వృత్తియందు అర్ధనిమిష మైన నుండెడను ప్రసిద్ధిగల సనకాది ఋషులును, శ్రీశుకుఁడును భగవత్ప్రాప్తి నాశించి భక్తిచేసిరి. సనకాదుల నైమంత

గమనము, శ్రీ శుకుని కృష్ణనామ రూప గుణ లీలా పరిచర్య నిష్ఠాది మహాద్భుతవర్ణనము వారల భక్తిప్రవృత్తిని చాటు చున్నవి. శ్రీ శుకుడును కృష్ణవర్ణనము చేయుచు "జ్ఞానం విశుద్ధం పరమార్థమేక మనంతరం త్వబహిర్బ్రహ్మ సత్యం" అని చెప్పి కృష్ణునే బ్రహ్మగను, "ప్రత్యక్ప్రశాంతం భగవచ్ఛబ్ద సంజ్ఞం" అని చెప్పి కృష్ణునే భగవంతునిగను, "యద్వాసుదేవం కవయోవదంతి" అని చెప్పి అతనినే పరమాత్మగను చెప్పియున్నాడు. "సర్వభూతాధివాసశ్చ వాసుదేవ స్తతో హ్యహమ్" పరమాత్మ, లేక, ఈశ్వరనామముతో సమస్త భూతముల యందంతర్యామి యగుటచే నేను వాసుదేవ శబ్దవాచ్యుడ నగుచున్నా ననియే కదా దీని కర్థము? పరమాత్మ (యోగ)నిష్ఠుడైన భీష్ముడు జీవేశ్వర సంయోగ రూపఫలముగ నిత్యము ఆత్మానంద మనుభవించు వాడయ్యును కృష్ణునే జ్ఞానాత్మగా వర్ణించి "యం జ్ఞానేనాభిగచ్ఛంతి" తమ జ్ఞానసాధనచేతనే కృష్ణుని పొందుచున్నారని చెప్పుటయే కాక, "కృష్ణప్రణామో న పునర్భవాయ" "కృష్ణవ్రతాః కృష్ణమనుస్మరంతో, రాత్రౌ చ కృష్ణం పునరుత్థితాయే, తే కృష్ణదేహాః ప్రవిశంతి కృష్ణ మాజ్య యథా మంత్రహుతం హుతాశే" కృష్ణుని నమస్కరించువారికి మఱు జన్మము లేదనియు, తమకు సర్వము కృష్ణుడేయని తెలిసికొని రాత్రింబవళ్ళు కృష్ణస్మరణము సేయువారు భ్రమరకీటన్యాయమున కృష్ణ స్వరూపమునొంది అగ్నియందు వేల్చిన హవిస్సువలె కృష్ణునియందే ప్రవేశించు చున్నారని చెప్పి తన పరమ భాగవత స్థితిని వెల్లడించెను. ఇట్లే భగవన్ (భక్తి) నిష్ఠులగు కబీరుదాసు, తులసీదాసు మున్నగువారుకూడ తాము కొలుచు

కళ్యాణకమమూర్తియందు బ్రహ్మపరమాత్మ భావములు కలిసియే యుండెను. రామభక్తుడైన కబీరు శ్రీరామచంద్రుని సంబోధించి "రూపనహీ, రంగనహీ, నహీ బరన ఛాయా, నిర్వికార నిర్గుణ హీ తూంచి రఘురాయా!" 'రఘురామా! నీవు నామరూప రహితుండవు, నిర్వికారుఁడవు. నిర్గుణుఁడ' వని చెప్పి అతనియందు బ్రహ్మభావము చేసెను. రామభక్తుఁడగు తులసీదాసుకూడ శ్రీరామచంద్రుని "బ్రహ్మతూ * * * పరమేశ్వర స్వామి అంతరజామి" 'నీవు బ్రహ్మవు, పరమేశ్వరుఁడవు, ప్రభువవు, అంతర్యామివి' అని సంబోధించి అతనియందు బ్రహ్మభావమును, పరమాత్మభావమును కూడ చేసెను. కావున శుకాదులును, భీష్మాదులును, కబీరు తులసీదాసాదులును ఆత్మతత్త్వముయొక్క సంపూర్ణజ్ఞానము కలవారనుటలో సందేహమే లేదు కదా? అద్వయ జ్ఞానతత్త్వమగు నాత్మ నిరాకారమును, జ్యోతిర్మాత్రమే కాని సాకారమును, (చిన్మయ) మూర్తిమంతమును, ఎన్నటికిఁ గాజాలదను వారలును, ఆత్మ సాకారము, మూర్తిమంతమే కాని చిత్రకాళస్థితిని పొంది నిరాకారస్థితిదాని కెన్నటికిని కలుగదను వారలును ఖండవిత్పండితులే అగుచు ఆత్మతత్త్వమునుండి వంచితులగు చున్నారు. మొదటి శ్రేణివారు శుష్క బ్రహ్మజ్ఞానులును, రెండవ శ్రేణివారు మూఢభక్తులును మాత్రమే అగుచు తమతమ సిద్ధాంతయందెన్నటికి నిశ్చలత్వము నొందక వ్యర్థజీవనులగు చున్నారు.

"రసో వై సః" అని ఉపనిషత్తు చెప్పిన విధముగ ఆ తత్త్వమగు శ్రీకృష్ణుడు నిర్మల ప్రేమ కృష్ణ తత్త్వమే స్థితినే నిర్దేశించువాడగుచు ఆనంద నిర్మల ప్రేమ స్వరూపుడగుచున్నాడు. సూర్య మండలమందలి నడిమి గోళమునకు కిరణప్రకాశముతో అవినాభావ సంబంధమున్నట్లు చిత్సూర్యుడగు శ్రీ కృష్ణుడు మనుష్యరూప ధారివలె మధ్యమాకృతితో గనుపడుచున్నను తన చిత్ప్రకాశకారణమున అనంతవ్యాప్తి కలవాడే అగుచున్నాడు. మరియు సూర్యరశ్మితో అవినాభావసంబంధము కలవేడిమివలె చిత్సూర్యుడగు కృష్ణుని యందు "చిత్" (జ్ఞాన) లక్షణ మొప్పుచుండును. అనంత జ్ఞానవ్యాప్తికి ఉనికి (సత్త)యే సహజలక్షణమగుటచే శ్రీకృష్ణుడు "సత్" లక్షణము కలవాడుకూడ అగుచున్నాడు. ఈ విధముగ శ్రీకృష్ణుడు అనగా, అద్వయజ్ఞాన తత్త్వము, సచ్చిదానంద లక్షణుడగు చున్నాడు. ఈ సచ్చిదానంద లక్షణము ఆత్మతత్త్వమగు శ్రీకృష్ణుని సాకార (భగవాన్) నిరాకార (బ్రహ్మ)స్థితులు రెండింటికి అన్వయించు చున్నది.

నిర్మల ప్రేమయే కృష్ణతత్త్వమగుటచే శ్రీకృష్ణుడు ప్రేమ మూర్తి అగుచున్నాడు. అతని గుణసామ్యావస్థయే చిత్ప్రకాశము ప్రేమ సముద్రమగు శుద్ధ సత్త్వము చున్నది. చిత్ప్రకాశాంతర్గత ప్రతి మూర్తులు ప్రేమాంశము లగు చున్నారు. ఇట్లగుటచే భగవంతుడును, బ్రహ్మయు, పరమాత్మయు ప్రేమమయులేయే కదా తేలుచున్నది? ఆత్మ స్వరూపుడగు శ్రీకృష్ణుడు చిన్మయుడు, అనగా శుద్ధ సత్త్వ

మయుండు. "సో౽కామయత బహుస్యాం ప్రజాయేయ" అని యుపనిషత్తు చెప్పినవిధముగ కృష్ణ సంకల్పమే సృష్టికిఁ గారణ మగుచున్నది. కృష్ణ సంకల్పమే తన యందంతర్భూతముగ నున్నశక్తిని సృష్టిరూపమున వెలువరించును. కృష్ణశక్తి సదా చిన్మయమే. కావుననే దానిని "చిచ్ఛక్తి" అని చెప్పుదురు. ఈ శక్తి మూడు గుణములు కలదిగా వేదము మనకుఁ జెప్పుచున్నది. సత్త్వము, రజస్సు, తమస్సు అనునవియే ఈ మూఁడు గుణములు. సత్త్వలక్షణము నిర్మలత్వము; తమోలక్షణము మోహాది రూపమగు మాలిన్యము. రజస్సు క్రియాలక్షణము కలదై సత్త్వతమస్సులతోఁ జేరి నిర్మలత్వమునో, మాలిన్యమునో సంపాదించుచుండును. ఈ మూఁడు గుణములు ముప్పిరి గొని యున్నపుడు సత్త్వమును మలిన సత్త్వమనియే చెప్పుదురు. మలిన సత్త్వగుణ ప్రాధాన్యస్థితియందు, దేవతా సృష్టియు, రజోగుణ ప్రాధాన్యస్థితియందు మానవసృష్టియు, తమోగుణ ప్రాధాన్యస్థితియందు పశుపక్షితిర్యగాది స్థావర జంగమ సృష్టియు కలుగుచున్నవి. ఈ మూఁడు గుణములు ముప్పిరిగొని యున్నస్థితికి ప్రకృతి లేక మాయ అని పేరు. కృష్ణ సంకల్పముచేఁ బ్రకృతి ప్రళయము సంభవించునపుడు సృష్టియంతయు నాశనమగుటయే కాక మూఁడు గుణములు ముప్పిరిగొని యున్నస్థితియు మాఱి వానికి సామ్యావస్థ కలుగును. ఈ సామ్యస్థితిలో గుణములు మూఁడును పైనిఁ జెప్పిన తమ తమ సహజలక్షణములను పూర్తిగఁ గోల్పోయి తమకంటె అత్యంత భిన్నలక్షణముగల ఒక ద్రవ్యముగఁ బరిణమించుచున్నవి. దీనికి శుద్ధ సత్త్వమని పేరు. సృష్టిబీజ మిట్టి శుద్ధసత్త్వస్థితియందు శుద్ధ సత్త్వమూర్తియగు శ్రీకృష్ణుని

ఆశ్రయించి యున్నప్పుడు పాలు పాలలోఁ గలిసిన విధమేర్పడి అద్వయజ్ఞాన మూర్తియగు శ్రీకృష్ణుఁడొక్కఁడే వెలుఁగుచుండును.

చతుర్వ్యూహము.

కృష్ణునకు సృష్టిసంకల్పము కలిగినప్పుడు తనయందు శుద్ధ సత్త్వరూపముతో నున్న సృష్టి బీజమునకు సంకల్ప స్పందము తాఁకుటచే గుణ సంక్షోభమునకు ఉన్ముఖతావస్థ అను ప్రథమస్థితి యేర్పడుచున్నది. తదుపరి అస్పృష్ట సంక్షోభము రెండవస్థితియు, సంకుచిత సంక్షోభము మూడవస్థితియు, విస్పష్ట సంక్షోభము నాల్గవస్థితియు ఆ సృష్టి బీజమునకు కలుగుచున్నవి. సృష్టిబీజముయొక్క శుద్ధ సత్త్వరూపమునకు ఆశ్రయస్థానము శ్రీకృష్ణుఁడగుటచే అతనినే సృష్టికి మూలకారణుఁడుగా గాని, లేక కారణ కారణునిగా గాని చెప్పుచున్నారు. పైనిచెప్పిన ఉన్ముఖతావస్థకు ఆశ్రయస్థానము శ్రీకృష్ణుని రూపాంతరమగు వాసుదేవుఁడనియు, అస్పృష్టసంక్షోభమునకు ఆశ్రయస్థానము సంకర్షణుఁడనియు, సంకుచితసంక్షోభమునకు ఆశ్రయస్థానము ప్రద్యుమ్నుఁడనియు, విస్పష్ట సంక్షోభమునకు ఆశ్రయరూపము అనిరుద్ధుఁడనియు భాగవత ధర్మములందుఁ జెప్పబడినది. పైనాల్గు స్థితులకు ఆశ్రయములైన రూపములకు చతుర్వ్యూహమని పేరు.

సృష్టినిర్మాణవిధానము

గుణక్షోభము విస్పష్టము, సంపూర్ణము అయినగాని సృష్టికలుగదు. కావున విస్పష్ట సంక్షోభమునకు ఆశ్రయరూపుఁడగు అనిరుద్ధుఁడే సృష్టికి సాక్షాత్కారణుఁడు. ఈ అనిరుద్ధునికే మహా విష్ణు వనియు, నారాయణుఁ

డనియు నామములు కలవు. నారాయణుడన జలములే స్థానముగా కలవాడని అర్థము. ఇచ్చట నారాయణుడు శ్రీకృష్ణుని చిత్ప్రకాశమగు ప్రేమ (క్షీర) సముద్రమందు శయనించి సృష్టిని సంకల్పించును. సృష్టిసంకల్పము యొక్క బహిర్నిఃసృత స్థితియే అతని నాభినుండి వెడలిన తామరకాడ. ముకుళావస్థనున్న విశ్వమే తామరమొగ్గ. నారాయణుడే సృష్టికర్త యయ్యును సృష్టిని పెంపొందించు పని తానే చతుర్ముఖ బ్రహ్మరూపము వహించి యొనర్చెను. గుణత్రయముయొక్క అత్యంతసంక్షోభము తామరమొగ్గయొక్క రేకులు విడుట. కమలము వికసించినంతనే అందు అంతవఱకు శయనించి యున్న చతుర్ముఖబ్రహ్మ కన్నులు తెఱచి తానెవరో, తనకు స్థానమగు కమలమేమిటిదో తెలిసికొనఁగోరి కమలనాళము వెంటదిగుటయు, దాని అంతు తెలియఁజాలక మఱల బయటికి వచ్చుటయు, అప్పుడా జలములనుండి "తప తప" "ధ్యానింపుము ధ్యానింపు" మనియెడి ఒకశబ్దము బయలు వెడలుటయు, మనము పురాణములవలనఁ దెలిసికొనిన విషయమే. బ్రహ్మ అపుడు అంతర్ముఖుఁడై ధ్యానించినంతనే నారాయణుడు ప్రత్యక్షమై "వత్సా! నీవు సృష్టికర్తవగు బ్రహ్మదేవుఁడవు. కావున భువన నిర్మాణమొనర్పుము" అని వచించెను. బ్రహ్మదేవుఁడపుడు పూర్వసృష్టిని స్మరించి సూర్యచంద్రులను, గ్రహతారకాది గణములను, దేవమానవ సృష్టిని, పశుపక్షి తిర్యక్స్థావర జంగమాది సమస్తమును యథాపూర్వముగ నిర్మించెను. బ్రహ్మనిర్మితమగు ఈసృష్టికంతటికిని కృష్ణచిత్ప్రకాశ రూపమగు ప్రేమసముద్రమే ఆధారమగుచు దానియందే అది దోఁగాడుచుండును.

# II

**జ్ఞాన మార్గ లక్షణము**

గుణత్రయ పరిణామరూపమగు సృష్టియందుఁజేరిన సమస్త మానవులును గుణప్రభావములకు సహజముగ లోఁబడిన వారగుట చేత ఆత్మలక్షణమగు శుద్ధ సత్త్వమునకు సంబంధించిన నిత్యానందమునకు దూరులై రజస్తమః ఫలమగు దుఃఖముతోఁ గలిసిన ఆనందమునే, అనఁగా సుఖదుఃఖములనే అనుభవించుచుందురు. దుఃఖము ఆత్మలక్షణము కాకుండుటచేత జీవాత్మలగు మానవులు దుఃఖరహితమగు సుఖానుభవము కొఱకు సహజముగఁ బ్రయత్నింతురు. ఇది ప్రతిజీవునికి అనుభవ వేద్యమగు విషయమే. అమిశ్ర సుఖము, అనఁగా నిత్యానందస్థితి ఆత్మలక్షణమగుటచేతను, పరమాత్మయగు శ్రీకృష్ణుఁడు ప్రేమమూర్తియై సృష్టినంతటిని సదా ఆకర్షించు వాఁడగుటచేతను, సమస్త మానవులును ఆత్మయొక్క ఆకర్షణకు లోఁబడినవారే అగుచున్నారు. కాని నిత్యానంద సంపాదనకొఱకు మానవులు చేయు ప్రయత్నము తమతమ స్వభావముల ననుసరించి యుండును. వారిలో కొందఱు అద్వయజ్ఞాన తత్త్వమగు శ్రీకృష్ణుని యందు బ్రహ్మభావముచేసి బ్రహ్మమేసత్యవస్తువనియు సృష్టి నశ్వరము (మిథ్య) అనియు మాటిమాటికి వివేచించుచుందురు. ఇహపరలోకముల యందలి భోగవస్తువుల యెడల అత్యంతము వైరాగ్యము నభ్యసింతురు. అంత రింద్రియ బహిరింద్రియ నిగ్రహము సాధింతురు. చంచలమగు మనస్సును విషయములనుండి మఱలించి స్వస్థానములందు నిలుపుదను

ప్రాపంచిక దుఃఖములు కలుగుచుండ వానికి ప్రతిసేత నాలోచింపక శాంతచిత్తముతో వాని నోర్తురు. తాము పరమాత్మ తత్త్వమే అను బుద్ధికలిగి యుందురు తమబుద్ధిని పరబ్రహ్మ తత్త్వమందు చేర్చుట అభ్యసింతురు. దుఃఖమయమగు ప్రపంచ బంధమునుండి విడివడుట యందు తీవ్రమగు నిచ్ఛ కలిగి యుందురు. ఇట్టి నిరంతరాభ్యాసఫలముగ వారి అంతఃకరణము శుద్ధమగును. చిత్ప్రకాశమండలి ప్రత్యణువునందును శ్రీకృష్ణుడే పరమాత్మ రూపమున వసించుటచేత ఆ విధముగ మానవ హృదయముల యందు అంతర్యామిగనున్న శ్రీకృష్ణుని తను కాంతిరూపమగు బ్రహ్మానుభవము తమ శుద్ధాంతఃకరణములందు పొందుచున్నారు. జ్యోతిర్మయమగు నిరాకార బ్రహ్మానుభవముతో వారిట్లు తృప్తిచెందు చున్నారు. ఇట్టి స్థితియందు వారికి దేహాభిమానముండదు. ఇది నిర్వికల్ప సమాధిలక్షణము.

**యోగమార్గ లక్షణము.**

మరికొందఱు తాము ఆత్మతత్త్వమును యెఱింగి తమ దేహేంద్రియాదులకు ఆత్మ సాన్నిధ్యముచే కలిగినచేష్టయే తమకు బహిర్ముఖస్థితియు, దుఃఖమయమగు ప్రపంచ వ్యాపారమును కలిగించుచున్నదని తెలిసికొని ఆ దేహేంద్రియములను నిగ్రహించుటకును, బహిర్ముఖ లక్షణముగల తమ జీవస్థితిని పాపుకొనుటకును అహింస, సత్యము, అస్తేయము (ఇతరుల సొత్తు హరింపకుండుట), బ్రహ్మచర్యము, అపరిగ్రహము (ఇతరుల సొత్తు గ్రహింపకుండుట), శౌచము, సంతోషవృత్తి, తపస్సు, స్వాధ్యాయము (జపము), ఈశ్వర ప్రణిధానమును అభ్యసింతురు. తదుపరి రేచక పూరక కుంభక రూపమగు ప్రాణాయామమును నాచరించుటచే సత్త్వమయ

మగు తమ చిత్తమునావరించియున్న రాజస తామసవాసనలు
పూర్తిగానశించును. అందువలన చిత్తము ప్రకాశవంతమగుచు
దాని నెచ్చట నిలిపిన నచ్చటనే నిలుచును. దీనిని ధారణ
అందురు. ఈ స్థితియందు ఇతర వస్తుజ్ఞానము చేరనప్పుడు
ధ్యానస్థితి కలుగుచున్నది. ధ్యానస్థితియందు "నేనుధ్యానించు
వాడను" అను జ్ఞానము నశించి ధ్యేయవస్తువు మాత్రము
స్ఫురించుచున్న యెడల ఇది సమాధి అగుచున్నది. ఈ
ధారణాధ్యాన సమాధులను సాధకుడు తన అంతర్యామి
తత్త్వమందు అభ్యసించినపుడు అతనికి శ్రీకృష్ణస్వాంశ
రూపమగు పరమాత్మదర్శనము తన నిర్మల చిత్తమందు
లభించుచున్నది. తన ప్రత్యేక జీవస్థితి పరమాత్మయందే
లయమగుచున్నది. ఇట్టి స్థితియందు సాధకునకు దేహాభాన
ముండదు. ఇది కైవల్యసమాధి లక్షణము.

భక్తిమార్గ లక్షణము

మఱి కొందఱు విషయత్యాగము, సంగత్యాగము, నిరంతర భజనము, భగవద్గుణ శ్రవణ కీర్తనము, సాధుసంగము మున్నగు భక్తిసాధనలను సదాచేయుచు తన్మూలమున నిర్మల చిత్తులై సత్త్వప్రకాశముగల తమ హృదయములయందు భగవద్దర్శనముచేసి భగవంతుని రూపగుణ లీలానందముల ననుభవింతురు. సమస్తావతారములకు ఖనియగు శ్రీకృష్ణుడు "యే యథామాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం" అనగా, ఎవరెట్లు నన్ను సేవింతురో వారి నట్లే నే ననుగ్రహింతునను అభయమిచ్చుటచేత అతడు నిరంకుశుండయ్యును ప్రేమమూర్తి అగుటచేత భక్తుడు కోరిన రూపము

తోనే అతఁడు దర్శనమిచ్చుచుండును. భగవద్దర్శనకాలమందు భక్తునికి దేహభాన ముండదు. ఇది సహజ సమాధి లక్షణము.

శ్రీకృష్ణునియందు బ్రహ్మభావము చేయువారు జ్ఞానులనియు, ఈశ్వరభావము చేయువారు యోగులనియు, భగవద్భావము చేయువారు భక్తులనియు పెద్దలు చెప్పుదురు. వీరందఱును ఆత్మజ్ఞానము కలవారే అని మనము ముఖ్యముగ గుర్తింపవలెను.

అర్థపంచకము

భగవత్స్వరూప దర్శనము భక్తిమార్గమునకు సంబంధించినదే కాని జ్ఞానమార్గమునకుగాని, యోగమార్గమునకుగాని సంబంధించునదికాదు. శ్రీకృష్ణ భగవానుఁడు భక్తిసులభుఁడు, ప్రేమమయుఁడు. తన బిడ్డల కండఱికిని తన దర్శనము లభింపవలెననే అతఁడు సదా అభిలషించుచుండును. జ్ఞానికి బ్రహ్మప్రాప్తివలెను, యోగికి పరమాత్మప్రాప్తివలెను, భక్తునికిఁగూడ సమాధిస్థితియందే భగవద్దర్శనము లభించుచున్నది. అట్టి సమాధిస్థితి జనసామాన్యమున కండఱికిని కలుగునది కాదుకదా? కావున ప్రేమమయుఁడగు శ్రీకృష్ణుఁడు దుష్టసంహారమునకు, శిష్టరక్షణమునకే కాక, ముఖ్యముగఁ దనదర్శన మండఱికిని లభింపవలయునను కోరికతో లెక్కలేని అవతారముల నెత్తుచుండును. తాను అంతర్యామి తత్త్వమగుట అట్లుండ పరతత్త్వ వాసుదేవుఁడై, వ్యూహ తత్త్వసంకర్షణ (బలదేవ), ప్రద్యుమ్న, అనిరుద్ధరూపధారియై వృష్ణులయందు అవతరించుటయు, లీలావతారుఁడై రామ, కృష్ణ (స్వాంశ కృష్ణుఁడు కాని స్వయంరూప కృష్ణుఁడు కాఁడు) నృసింహాది

రూపములు ధరించుటయు, మాత్రమే కాక అర్చావతారములై శ్రీశైల వేంకటాచలము లందును, మథుర, బృందావన, కాశీ, ప్రయాగ, పురుషోత్తమ క్షేత్రాదులందును దారు శిలారూపములతో భక్తకోటికి నిత్యదర్శన మొసంగుచున్నాడు. భగవంతుడు నిరాకారుడగుటచే దన యిష్టానుసారములగు రూపములు ధరించి అర్చామూర్తులందు గోచరించుచున్నాడు.

తంత్రీవార్తలు నడచునప్పుడు టెలిగ్రాపు స్తంభములకు కట్టియున్న తీగెను మన మొకసారి తాకినచో మన వ్రేలికి దేలుకుట్టినట్లయి ఒకప్పుడు శరీరమందంతట అలజడి కూడ జనించును. దీనికి గారణమేమన ఆ తీగెయందు గల విద్యుచ్ఛక్తి ప్రభావమే. విద్యుచ్ఛక్తి తీగెయందు వెలుపలను, లోపలను పూర్తిగా నిండియున్నట్లు భగవత్స్వరూపముగల అర్చామూర్తియందు భగవచ్ఛక్తినిండియుండును. తీగయందు గల విద్యుచ్ఛక్తి ప్రభావము మనయందుగల ప్రాణశక్తి చేతనే తెలిసికొనుచున్నాము. నిర్జీవమగు మానవ కళేబరమును విద్యుచ్ఛక్తితో నిండియున్న తీగెపై పండవైచినను అది తచ్ఛక్తి ప్రభావము గ్రహింపనేరదు. తనయందు ప్రాణశక్తి లేకుండుటయే యిందులకు గారణము. ఇట్లే భగవచ్ఛక్తితో గూడియున్న అర్చామూర్తి ప్రభావము మనకు తెలిసికొనవలె నన్న భగవద్విశ్వాసము మనము కలిగియుండవలెను. దేవుడున్నాడను నమ్మికయే మన యందలి ప్రాణశక్తి. "అస్తీతి బ్రువతోఽన్యత్ర కథం తదుపలభ్యతే", "అస్తీత్యేవోపలబ్ధస్య తత్త్వభావః ప్రసీదతి" దేవుడు లేడను వానికి భగవద్దర్శనము లభింపదనియు, దేవుడున్నాడను దృఢవిశ్వాసము కలవానికి భగవత్ స్వరూపదర్శనము లభించుచున్నదనియు, ఉపనిషత్తే

చెప్పుచున్నది. దేవుఁడున్నాఁడను నమ్మికయే కాక, అతని యనుగ్రహమెవనిపైఁ బ్రసరించునో, అట్టివానికే భగవత్ స్వరూపదర్శనము లభించుచున్నదని తెలిసికొని మనము ప్రార్థన బలముకూడ కలిగి యుండవలెను. "యమేవైషవృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వాం" భగవంతుఁడెవని ననుగ్రహించునో అతనికే తనస్వరూపమును ప్రకాశింపఁ జేయుననునది ఉపనిషద్వాక్యము. ఇంతేకాక భగవంతునియందు ప్రేమ కలిగిన వారికే భక్తుఁడు కోరిన స్వరూపముతో తాను దర్శనమిత్తునని భగవంతుఁడే చెప్పెను. అర్జునుని కోరిక ననుసరించి కృష్ణభగవానుఁడు తనవిశ్వరూప మతనికి కనుపఱచుటకుఁ దనయందు అర్జునునికి గల ప్రేమయే కారణము. తన విశ్వరూప సందర్శనము యజ్ఞదాన తపస్సులచే లభించునది కాదనియు, అర్జునునియొక్క అనన్యభక్తి (ప్రేమ) ఫలముగ నది లభించుననియు, కృష్ణుఁడే గీతలలో చెప్పెను. కాబట్టి మనయందున్న ప్రాణశక్తిచే తంత్రి యందున్న విద్యుచ్ఛక్తి ప్రభావము తెలిసికొనఁ గల్గినట్లు భగవద్విశ్వాసము (ఆస్తికబుద్ధి), భక్తితత్పరత్వము, ప్రార్థనబలము అను ఈ మూఁడును మన పారమార్థిక జీవనమునకు ప్రాణశక్తిగ నేర్పడినప్పుడు అర్చామూర్తుల యందలి భగవత్ప్రభావము మనకు అనుభవమునకు వచ్చితీరును.

**స్వయం వ్యక్తములగు అర్చామూర్తులు**

విద్యుచ్ఛక్తిగల తీఁగెయు, లేని తీఁగెయు చూచుటకు ఒకేవిధముగ నున్నట్లు అర్చామూర్తులును, కేవల దారుశిలా రూపములును చూచుటకు ఒకే విధముగ నున్నను వాని సంబంధము మనకుఁ గలిగి

నప్పుడు అవి భిన్నభిన్న ఫలములనే మన కొసంగుచున్నవి. ఈ విషయము మనము ముఖ్యముగ గమనింపవలెను. భగవంతుడు తన నిరంకుశ వృత్తి క్రమమున అర్చారూపములతో అవతరించినపుడు బెల్లముగడ్డ లోపలను, వెలుపలను మాధుర్యగుణము కలిగి యున్నవిధమున ఆరూపములు బహిరంతరములందు చిచ్ఛక్తిమయములే అగుచున్నవి. విద్యుచ్ఛక్తిపూరిత మగు తంతియందు ఇది లోహభాగమనియు, ఇది విద్యుచ్ఛాగమనియు చెప్పుటెంత అసంభవమో, అర్చామూర్తుల యందు ఇది శిలాభాగమనియు, ఇది భగవచ్ఛక్తిభాగమనియు చెప్పుట అంత అసంభవమగును. ఇంతేకాక విద్యుచ్ఛక్తి నిలయము(Power House)తో తంత్రీసంబంధముగల పురభవనములవలె ఈ యర్చామూర్తులు నిత్యభగవచ్ఛక్తిసంగతములగుటచేత అనంతత ప్రభావము కలవగుచున్నవి. ఈ అర్చావతార మూర్తులనే స్వయంవ్యక్తము లందురు.

**ఋషిస్థాపితములగు ఆర్చా మూర్తులు**

స్వయంవ్యక్తములే కాక ఋషిస్థాపితములగు అర్చామూర్తులు కూడ మన దేశమందు గలవు. ఋషి యనగా ఆత్మజ్ఞానియై సాక్షాత్తుగ భగవద్దర్శనము చేసిన వాడని అర్థము. ఋషికి భగవద్దర్శనము సహజ సమాధి యందే లభించుచున్నది. భగవంతుడు తనకు ఏరూపముతో దర్శనమిచ్చునో, ఆ రూపానందము తానొక్కడే అనుభవింప నొల్లక ఋషి సర్వభూతహితరతుండగుటచే సమాధి సాధనకు సమర్థతయు, అర్హతయు లేని సామాన్య జనుల చర్మనేత్రములకు భగవద్దర్శనము లభింపవలయునను కోర్కెతో, వారలయందు అవ్యాజకరుణగల

వాఁడై సహజ సమాధియందు నిత్యము తాను దర్శించు భగవ ద్రూపమును సమర్థులగు శిల్పాచార్యులచే తమ అధ్యక్షత క్రింద ఒక శిలయందుఁగాని దారువునందుఁగాని చిత్రింపఁజేయును. శిల్పియు అంతశ్శౌచము, బహిశ్శౌచము కలవాఁడై వివిక్త ప్రదేశమందుండి భగవద్రూపమును నిర్మించు కాలమున ఆహా రాదులను ముట్టక, ధ్యాననిష్ఠాపరుఁడై తాను భగవద్దర్శన ప్రాప్తినొందుచున్నాననెడి మహోత్కంఠతో, జితేంద్రియ వృత్తితో భగవత్ప్రతిబింబమును నిర్మించును. తాను దర్శించిన భగవద్రూపముగల ఆశిలా విగ్రహమునందు ఋషి తన మంత్రప్రభావముచే భగవచ్ఛక్తి నావహింపజేయును. ఇవియు స్వయంవ్యక్తములగు అర్చామూర్తులతో సమాన ప్రభావము గల వయ్యెను కాచిన ఉష్ణోదకమును అగ్ని యుంచిన యెడల అది వేడిమి కోల్పోయి చల్లపడినట్లు ఆర్షమంత్రబలముచే భగవచ్ఛక్తిమయములగు ఋషిస్థాపిత విగ్రహములు మంత్ర హీనులును, మంత్రజ్ఞాన హీనులును అగు అర్చకులచేఁ బూజింపఁబడునప్పుడు కుంఠిత ప్రభావముకలవై క్రమముగ నిస్తేజములును, నిశ్శక్తికములును అగుచున్నవి. ఋషి నిర్మితములగు అర్చామూర్తులు మంత్రశక్తిచే ప్రభావ వంతములగుటవలన తత్ప్రభావము మంత్రశక్తిచేతనే పోషింపఁబడి చిరస్థాయి అగుచున్నది. కావున నిట్టి విగ్రహములకు మంత్ర శాస్త్ర ప్రవీణులగు అర్చకులచే నిత్యార్చన విధి అవశ్యకర్తవ్య మగుచున్నది. ఋషిస్థాపిత శ్రీమూర్తులకు ఋషులయందు అమిత గౌరవ ప్రపత్తులుగల ఆనాఁటి ప్రభువులు కావలసినంత ద్రవ్యము వెచ్చించి ఆగమశాస్త్రము ననుసరించి దేవాలయ ములు కట్టించి సమర్థులగు ఆరాధకుల నేర్పఱచి అందుస్వామికి

నిత్యార్చనతో పాటు నిత్యము వేదపఠనము, శాస్త్రపఠనము, పురాణపఠనము, అఖండభజనము, వేదవిద్యార్థులకు, సాధు పురుషులకును అన్నదానము మొదలగు సత్కార్యములను చేయుచుండిరి. యోగవిధియందు జీవాత్మ పరమాత్మయందుఁ జేరుటెట్లు ఫలమగుచున్నదో, అట్లు అర్చకుఁడు తన్మయుఁడై తా నర్చించు శ్రీ మూర్తియందు లీనవృత్తి నొందుటయే అర్చన ఫలమగుచున్నది. దాక్షిణేశ్వర దేవాలయమునందు అర్చకుఁడుగా నుండిన శ్రీరామకృష్ణ పరమహంసయొక్క తన్మయస్థితియు, పారమార్థిక జీవనమును ఎవ్వరెఱుఁగనిది? కావున అర్చకులకు బహిర్ముఖస్థితి అలవడకుండుటకును, దేహ ధారణకొఱకు వారు లౌకిక విషయములయందుఁ బ్రవేశింప కుండుటకును దేవాలయ నిర్మాతలగు ప్రభువులు, ఆస్తికులగు ఇతరధనవంతులు భూ గృహాది రూపములగు చక్కని యుపాధులు వారలకుఁ గల్పించుచుండిరి. ఇట్లు అర్చకుల యోగ్యత చేత అర్షములగు శ్రీమూర్తుల ప్రభావము సురక్షితమగుచుండెను. స్వయం వ్యక్తములగు శ్రీమూర్తులు భగవంతుని అర్చావతారములే అగుటవలన పైనిఁజెప్పిన విధముగ నిత్య భగవచ్ఛక్తి సంగతములగుటచే గాలిచే నాఱని విద్యుద్దీపముల వలె అర్చకుల అసత్ప్రవర్తనలచే అవి కుంఠిత ప్రభావములు కాకుండును. అవి అపరిమిత ప్రభావములు కలిగి సర్వజనులను ఆకర్షించుచుండుటచే యోగ్యతగల అర్చక బృందము, లక్షలాదిగఁ దమదర్శనమున కరుదెంచెడి భక్తబృందము, సుంద

రములు, విశాలములునగు దేవాలయములు, కలిగి సకలైశ్వ ర్యములతోఁ దులతూఁగు చుండును. ఇట్టి అర్చామూర్తులే మనదేశమును ప్రాణవంత మొనర్చుచు దాని ఆధ్యాత్మి కౌన్నత్యమును చిరస్థాయి నొనర్చుచున్నవి.

దేనిని శ్రీ విగ్రహ పూజన మందురు?

ఋషి స్థాపితమూర్తులనే కానీ, స్వయంవ్యక్తమూర్తు లనే కానీ, దర్శించు స్త్రీ పురుషులలో విద్యాధికులును, పామర జనమునుకూడ ఉందురు కదా? దేవాలయములకు బోవునపుడు వారందఱును తాము భగవద్దర్శనమునకుఁ బోవుచున్నామనియు, తాముగొం పోవుచున్న పూజాద్రవ్యములు భగవంతుని కొఱ అనియు, దర్శన ఫలముగ భగవంతుఁడు తమ కోర్కెలన దీర్చుననియు, తమ సపర్యల నన్నియు భగవంతుఁడే గ్రహించు చున్నాఁడనియు, భావింతురే కాని తాము కొయ్యబొమ్మలన ఱాతిబొమ్మలను చూడఁబోవుచున్నా మనెడి భక్తులు మనల లేరు. అర్చావతార చరిత్రము తెలిసినను, తెలియకపోయినన దర్శించువారల భక్తివృత్తి ననుసరించి ఫలము లభించిర తీఱును. ఏమన, శ్రీమూర్తులు భగవచ్ఛక్తి మయము భగవత్ స్వరూపములే అగుటచేతను వాని మూలమ భగవంతుఁడు భక్తుని హృదయమును పరీక్షించి అతని యర్హ కనువగురీతిని అనుగ్రహించును. కాఁబట్టి మనముచేయున శ్రీమూర్తి పూజనముకాని విగ్రహారాధనముకాదు. విగ్ర రాధన మనఁగా కొయ్యపూజ, ఱాతిపూజ; ఇది సర్వ నింద్యము.

**దేనిని విగ్రహారాధన యందురు ?**

నెలకు వేలకొలది గడించు నొక శిల్పకారుని రావించి కృష్ణవిగ్రహము నొకదానిని తయారు చేయుమని మనము కోరుదుము అనుకొందము. ఆ శిల్పి మంచిపనివాడే కాని నవనాగరికుడు, భక్తి రహితుడును కావున సహజ సమాధిలో భగవద్దర్శనము చేయగల యోగ్యత లేనివాడు. కావున భగవంతుడగు శ్రీకృష్ణుని స్వరూపము నొకదానిని దన మనసుచే నూహించి తన బుద్ధి కుశలత కనురూపముగ జగన్మోహనమగు నొక కృష్ణ స్వరూపమును ఒక చలువఱాతి యందు దీర్చును. తనకు సహజ సమాధి లబ్ధమై తన ఆధిపత్యము క్రింద నొక శిల్పకారుని మూలమున ఋషి నిర్మించిన కృష్ణ విగ్రహముకంటె ఈ విగ్రహము వేయిరెట్లు సుందరముగ నుండవచ్చును. కాని యిది నామ మాత్రమునకు భగవత్ స్వరూపమైనను శిల్పకారుని బుద్ధిచే నిర్మింపబడిన దగుటచేత నిదియొక ప్రాకృతిక స్వరూపమే అగుచున్నది. ఋషినిర్మితమగు స్వరూపము భగవదిచ్ఛ ననుసరించి ఋషి సహజ సమాధియందు దర్శించిన రూపమగుట వలన నిది యథార్థమగు భగవత్ స్వరూపమగుచున్నది. కావున, అర్చామూర్తుల పూజనము భగవత్పూజన మగుచుండ బుద్ధికల్పితమూర్తుల పూజనము విగ్రహారాధన మగుచున్నది. దీనినే నరపూజ యనియు, పౌత్తలికత యనియు నందురు. పౌత్తలికత అనగా బొమ్మలపూజ. కావుననే అసురగురువగు శుక్రాచార్యుడు "అపి శ్రేయస్కరం నృణాం దేవబింబం విలక్షణం, సలక్షణం మర్త్యబింబం నహి శ్రేయస్కరం సదా" అనగా, సుందరమగు మానవప్రతిమకంటె

విలక్షణమగు భగవద్విగ్రహమే పూజార్హము, శ్రేయోదా
కము అని భావము.

ఋషినిర్మిత విగ్రహములు సందేహాతీతములు. సాక్షాద్భగవత్స్వరూపములు.

ఋషి నిర్మిత విగ్రహములు ఋషి కల్పితములు
మన మేల భావింపఁగూడదని కొంద
సందేహము కలుగవచ్చును. కొమార
గన్న నాలుగవదినమున ఒక ఆడ
తన భర్తను గోల్పోయెను. బిడ్డ
తండ్రి నెఱుఁగఁడు. కాఁబట్టి అతనితల్లి తన భర్త ఛాయ
పటము నొకదానిని భద్రపఱచి తన కుమారుఁడు పెద్దవాఁడై
నెనుక " నాయనా ! నీ తండ్రిని చూడుము" అని ఆ పట
నతనికిఁ జూపించెను. కుమారుఁడా పటమును జూచినప్పుడు దా
తన తండ్రియనియే భావించునుగాని వేఱువిధముగ భా
పఁడు కదా ? అతఁడా పటమునకు నమస్కరించును. దా
పూలమాలికలు వేయును. వారెవరని స్నేహితులడిగిన "న
తండ్రిగా"రని జవాబుచెప్పును. పటము నెవరైన అవమా
చిన యెడల వారిపై నమితమగు కోపము తెచ్చుకొను
కాగితమును, దానిపై రంగును చూచి "నాతండ్రి" అం
వేమనిన "నీకట్లు కనుపడునేమోకాని నాకు మాత్రము తం
గారే" అని తన స్నేహితునికి బదులుచెప్పును. ఇందుల
కారణమేమనిన కుమారునికిఁ దన తల్లిమాట యందు
విశ్వాసమే. తండ్రి రూపము తల్లికంటె తెస్పఁగఁదెలి
వారెవ్వరు ? ఋషి మనకు తల్లివంటివాఁడు. ఋషి మన
"నాయనా ! నీ తండ్రియగు భగవంతుని నేను జూచితి
అతని స్వరూపమిదిగో!" అని శిలానిర్మిత భగవత్స్వరూపము
మనకుఁ జూపినప్పుడు వాని వాక్యమును మనము విశ్వసింప

తల్లిమాటను కొడుకు విశ్వసింపనట్లే కదా? ఇది కేవలము స్వభావవిరుద్ధమగు కార్యము. కావున ఋషి నిర్మిత శిలా రూపము మనకు సాక్షాద్భగవ త్స్వరూపమే కాని వేఱొండు కాదు. కొమారునికి తండ్రి ఛాయాపటము రంగులకాగితమెట్లు కాదో మనకును ఋషి నిర్మిత శిలారూపము శిలకానేకాదు. అది లోపలను వెలుపలను కూడ భగవచ్ఛక్తిమయమే. ఇఁక భగవన్నిర్మితములగు స్వయంవ్యక్తమూర్తులను గుఱించి చెప్ప వలసినదేమున్నది? కనుక వెనుకఁజెప్పిన విధముగ భగవ ద్విశ్వాసమే మనకు భగవద్దర్శన లాభము కలిగించునది.

సాక్షాత్తుగ భగవద్దర్శనముచేసిన ఋషులలో కృష్ణ దర్శనము చేసిన ఋషులుందురు కదా?

భగవత్స్వరూపలక్షణము భగవదిచ్ఛ ననుసరించి యుండును.

వారలు నిర్మించు కృష్ణ విగ్రహములు ఒకే రూపముకలిగి యుండవలెను కదా? అట్లయినచో దక్షిణదేశమందు గురువాయూరు, ఉడిపి మున్నగుస్థలము లందలి కృష్ణ రూపములును, ఉత్తరదేశమందు మథుర బృందావనము, నవద్వీపమండలము మున్నగు స్థలములందలి కృష్ణ రూపములును కించిద్ భిన్నాకృతులతో ఏలయున్నవని మనకు సందేహము తోఁపవచ్చును. ఈ విషయము మనము తప్పక యోజింపఁ దగినది. భగవంతుఁడు ఏ స్వరూప ముతో భక్తునికి దర్శనమిచ్చునో ఆ స్వరూపము భగవ దిచ్ఛ ననుసరించి యుండునుగాని భక్తేచ్ఛ ననుసరించియే ఉండదు. ఎలయనిన, భగవంతుఁడు నిరంకుశుఁడు కృష్ణరూప సందర్శనలాలసులగు భక్తులందఱికిని ఒకే విధమగు రూప ముతో దర్శన మీయవలయునను నియమమునకు అంతను

బద్ధుఁడు కాఁజాలఁడు. సహజసమాధియందు ఏ భక్తునికి ఏ రూప దర్శనము లభించునో ఆ రూపమునే అతఁడు ప్రకటించును కాని రూపభేదముల నతఁడు కల్పింపఁడు; కల్పింపనురాదు. ప్రేమ మయుఁడగుటచే భగవంతుఁడు భక్తేచ్ఛననుసరించి కొండఱ కొకే రూపమున దర్శనమిచ్చిన నీయవచ్చును. కాని అది భగవంతుని ప్రేమలక్షణమునకు నిదర్శనముకాని అతని నిరంకుశ శక్తిని నియమించు విషయముగాదు. కావునభగవత్ స్వరూపములు భిన్నాకృతులుగ నుండుటయే సహజలక్షణము. భగవంతుని నిరంకుశస్థితిని నిరూపించునట్టి ఒక ఉదాహరణము నిచ్చుచున్నాను. చింతామణి యను వేశ్యయం దనురక్తుఁడై చాల కాలము పామరునివలె వర్తించిన పండితుఁడగు శ్రీలీలాశుకుఁడు కొంత కాలమునకు తన వేశ్యయే తనకు సద్బుద్ధి కలిగింపఁగా పరమభాగవతుఁడై శ్రీకృష్ణభక్తుఁ డయ్యెను. అతఁడు సదా తన నిర్మల హృదయమందు కృష్ణాను సంధానము చేయుచు కృష్ణానుగ్రహఫలముగఁ కృష్ణ దర్శనము నొందుచుండెను. ఈవిధముగ లీలాశుకుఁడు పవిత్రజీవనుఁడై నిత్య కృష్ణ దర్శనఫలముగ దనచిత్తము ద్రవించుచుండ భగవద్రూప లీలాగుణానుభవము కలిగి అప్రాకృతానంద మనుభవించు చుండెను. కొంతకాలమిట్లు జరిగిన వెనుక ఒకనాఁడు లీలాశుకుఁడు ఎప్పటివలెనే కృష్ణాను సంధానము చేయుచుండ భగవంతుఁడు శ్రీరామచంద్ర స్వరూపముతో ధనుర్బాణములు ధరించి అతని నిర్మలాంతః కరణమందు దర్శనమిచ్చెను. భగవంతుఁడు తన యిచ్ఛవచ్చిన రూపము ధరించి తన భక్తులకు దర్శనమిచ్చునని లీలాశుకునికిఁ దెలియును. కావుననే రామ, కృష్ణ రూపముల యందు వస్తుభేదప్రతిపత్తి అతని

నేమూ తమును లేకుండెను, కాని భగవంతుఁడు శ్రీకృష్ణ రూప ముతో దర్శనమిచ్చి నప్పుడు అతనికి చిత్తము ద్రవించినట్లు శ్రీరామ స్వరూపముతో దర్శనమిచ్చి నప్పుడు ద్రవింప దయ్యెను. కారణమేమన, జ్ఞానమార్గ యోగమార్గము లందువలనే భక్తిమార్గమందు కూడ ఆత్మలబ్ధి కుపాయము సాధకుని అభిరుచి ననుసరించియే ఏర్పడును. పూర్వజన్మము లందు తనకు ఏ మార్గసాధనము లభించి యుండెనో, అదే వాసనా రూపముగ అంతః కరణమందు ఈ జన్మమున గోచ రించును. ఈ వాసనయే మన అభిరుచిని నిర్ణయించెడిది. భక్తి మార్గమందలి ఈ యభిరుచి సాధకుని కిష్టమగు భగవత్ స్వరూప నిర్ణయమందు కూడ సహజముగ కనఁబడును. కావున శ్రీకృష్ణ స్వరూపమందు అభిరుచిగల లీలాశుకుఁడు శ్రీరామ చంద్ర స్వరూపముతో తనకు దర్శనమిచ్చిన భగవంతుని నుద్దే శించి "విహాయ కోదండశరౌ ముహూర్తమ్, గృహాణ పాణౌ మణిచారువేణుమ్, మయూరబర్హం చ నిజోత్తమాంగే, సీతా పతే! త్వాం ప్రణమామి పశ్చాత్" "సీతాపతీ! లోక భయంకరములగు నీధనుర్బాణములను ఒక్క నిమిషము ఆవల పెట్టి నీ రెండు చేతులందును మణిఖచితమగు మురళిని ధరిం పుము. నీ శిరమును నెమిలి పింఛముతో నలంకరింపుము. అప్పుడు (ద్రవచిత్తుఁడనై) నీకు నమస్కరించెదను."అనియెను. ఈ యుదాహరణమందలి ప్రస్తుత విషయమే మన మాదరింప దగినది. ప్రేమమయుఁడగుటచేభక్తుని కిష్టమగు స్వరూపముతో దర్శనమిచ్చు వాఁడయ్యును, అతని అద్వైతజ్ఞానము పరీ క్షించుటకే కాని, లేక తన నిరంకుశవృత్తి ప్రకటించుటకే కాని, వేరొకస్వరూపముతో దర్శనమిచ్చుట తన కెంత సహజ

కార్యమో ఒక్కటేయగు. ఇష్టరూపమును కూడ స్వల్పభే ములతో భక్తుల ప్రేమనేత్రమునకు కనుపర్చుట అంత సహ కార్యము. అణువంతైనను రూపభేదము లేకుండ ఒకేవిధము దర్శనమీయవలెననెడి సూత్రమున కతఁడు బద్ధుఁడుకాఁ భగవంతుఁడు నిరంకుశుఁడు, సర్వశక్తిమంతుఁడు అనెడి విశ్వా మెవనికిఁ గలిగియుండునో అతనికి "భగవంతుఁడు నిరాకారుఁ కాని సాకారుఁడు కారాదు. సాకారుఁడైనవుడు ప్రాకృ స్వరూపమునే అతఁడు వహింపవలెగాని చిన్మయస్వరూపవ అతఁడు వహింపఁజాలఁడు" అనునట్టి ధోరణి కలిగిన అహంభ యిష్టమగు భగవదనుశాసనపద్ధతి ఎన్నఁటికిని కలుగదు మానవ కుసంస్కార జన్యమగు ఇట్టిబుద్ధి మన పారమా జీవనమున కెన్నఁటికిని ఉన్నతిలాభము కలుగ నీయదు.

భగవదవతారములలో అర్చామూర్తికూడ అవత విశేషముగ భావించినప్పుడు భగవంతుఁడు దేహదేహి భేదః లేని చిన్మయాకారుఁడగుటచేతను, అవతరించువాఁడు భ వంతుఁడే అగుటచేతను, అర్చామూర్తికూడ బహిరంతః లందు చిన్మయవస్తువే కావలయునుకదా? అట్లుకాక శి రూపము కలిగి స్పష్టముగ జడపదార్థమే అగుచున్నదే య కొందఱికి సందేహము కలుగవచ్చును. కొందఱు "సర్వంఖ దం బ్రహ్మ", "ఏకో వశీ సర్వభూతాంతరాత్మా, ఏకం రూ బహుధా యః కరోతి", "వాసుదేవస్సర్వమిదం జగత్" వేదవాక్యముల నుదాహరించుచు సర్వము భగవంతు కావున ప్రపంచమునందలి ప్రతి పదార్థమునందును భగవ వముచేసి భగవంతుని చూచుటకు ప్రయత్నింపవలయునే అర్చామూర్తులను మాత్రము భగవంతునిగ భావించి పూజిం

కేల యనిన అనవచ్చును. ఇందులకు సమాధానము మాకము తెలిసికొనుట మేలు.

అర్చామూర్తులు చిన్మయములు

అద్వయజ్ఞాన తత్త్వమగు శ్రీకృష్ణుడు నిర్మలప్రేమ యనియు, ప్రేమయే సృష్టి స్థితి లయ ములకు గారణమనియు, అత్యంత ప్రళయ కాలమందు సృష్టి చిద్బీజముగ నుండి శుద్ధ సత్త్వరూపముతో శుద్ధ సత్త్వమయుడగు శ్రీకృష్ణునియందే లయమగు చున్నదనియు ముందే చెప్పియున్నాను. సృష్టిరూపము వహించు చిద్బీజము భగవంతుని శక్తియే అని వేదము చెప్పుచున్నది. "చిత్" లక్షణము కలదిగనుక నిది చిచ్ఛక్తి అనబడుచున్నది. "బహు స్యాం ప్రజాయేయ" (అనేకరూపములతో నుద్భవింతునుగాక) అను సృష్టి సంకల్పమతనికి గలిగినతోడనే తనయందంతర్భూత ముగ నున్న చిచ్ఛక్తి కృష్ణ సంకల్పబలముచే వెలువడి ఉన్నత స్థానమునందుండి పల్లమునకు జారుచుండెడి మహాప్రవాహము నందలి జలము ఎంతటివేగముతో పారుచుండునో, అంతకు మించిన దురూహమగు వేగముతో పురోగమించుచుండును. ప్రవాహజలము నిర్మలమై రూపరహితముగ నున్నను, వాయు బలము తాకుటచే జలమందు బుడగలు, సుళ్ళు, అలలు, నురుగు మున్నగునవి తోచునట్లు కృష్ణుని సృష్టిసంకల్ప బలము తాకుడుచే చిచ్ఛక్తియందు పంచతన్మాత్రలు, పంచభూత ములు, దశేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము, స్థూల దేహ సమూహము మున్నగునవి తోచుచున్నవి. జలముపై నురుగు తేలియాడు నట్లుగా, నిర్మలమగు జలముకంటె వేర్లవి

రంగుగల నురుగు భిన్నముగ దోచునట్లును, చిచ్ఛక్తియందే జడస్వరూపముగ స్థూలసృష్టి దోచుచు దానికంటె భిన్నపదార్థముగ భావింపబడుచున్నది. కాని నురుగు జలవికారమే అగుచు జలముకంటె సహజముగ నెట్లు అభిన్న పదార్థమగుచున్నదో స్థూలసృష్టియు చిచ్ఛక్తి వికారమే అగుచు చిచ్ఛక్తియే అగుచున్నది. శ్రీ శంకరాచార్యులుగారు చెప్పినట్లు "సద్బ్రహ్మకార్యంసకలం సదేవ" బ్రహ్మకర్తృకమగు సృష్టియంతయు బ్రహ్మమే అగుచుండ "చిచ్ఛక్తికార్యం సకలంచిదేవ" చిచ్ఛక్తి పరిణామమగు జగత్తంతయుం జిద్రూపమే అగుచున్నది. ఇంతే కాక శ్రీ శంకరాచార్యులుగారు "పరమార్థతో విచారే గుడతన్మధురత్వ దృష్టాంతాత్, నశ్వరమపి నరదేహం పరమాత్మాకారతాం యాతి" "సత్యదృష్టిని విచారింపగా బెల్లమునకును, దాని మాధుర్యమునకును భేదము లేదను సామ్యము ననుసరించి నశించెడి నరదేహము సైతముపరమాత్మాకారమే, అనగా, చిన్మయమే అగుచున్న' దని స్పష్టముగ దమ ప్రబోధ సుధాకరమను గ్రంథమునం జెప్పియున్నారు. కనుక సత్యదృష్టి లేకుండుటచే మనకు జడమయముగ దోచెడి సమస్త సృష్టియు, తాత్త్వికముగ చిన్మయమే అగియు, చిన్మయ వస్తువునందు జడకల్పనమునకే మిథ్యాశబ్ద మన్వయించుచున్న దనియు, ఆచార్యులవారు చెప్పుదురు. కావున సృష్టియందు జడవస్తువే లేనప్పుడు అర్చామూర్తులు చిన్మయ విగ్రహములే కావలయును కాని జడపదార్థము లెట్లు కాగలవు? అర్చామూర్తులే అం నేల? ఋషిస్థాపిత విగ్రహములు కూడ చిన్మయమూర్తులే కదా?

ఆత్మదృష్టి కలవారికి శ్రీమూర్తి పూజ మవసరమా?

సత్యదృష్టి కలవానికి శ్రీమూర్తి పూజవలన పొంద వలసిన ఫలమెద్దియు లేదు. ఏమన, శ్రీమూర్తి పూజకు చరమ ఫలమగు చిన్మయదృష్టి అతనికి లభించియే యున్నది. శుద్ధసత్త్వరూపమున తన యందున్న చిద్బీజము తన సంకల్ప బలముచే సృష్టిరూపము వహించి శుద్ధసత్త్వేతరముగ, అనఁగా జడరూపమున తోఁచినప్పుడు నిత్యశుద్ధ సత్త్వమూర్తియగు శ్రీకృష్ణుఁడు సృష్టియందు అనుప్రవేశ మొనర్చు చున్నాఁడు. కారణమేమన, సృష్ట్యాదిని శుద్ధసత్త్వరూపమునుండి కృష్ణ సంకల్పబలముచే సృష్టి రూపము వహించి జడస్వరూపమున దోఁచు తనశక్తి (ఆత్మశక్తి, లేక చిచ్ఛక్తి) తనకంటె అభిన్నమగుచు చిన్మయమే అగుచున్నదను జ్ఞానము పరిణామ రహితుఁడును, నిత్యసత్త్వమూర్తియు నగు తన జ్ఞానముపై ఆధారపడి యుండును గనుకను, జడజ్ఞానము జడవిలయ కాలమందుగాని చిద్జ్ఞానముగ పరిణమించదు గనుకను, జడదృష్టిమాయుటకు వలయు సాధనకు తాను ప్రతిష్ఠాభూతుఁడు కానియెడల సాధన సాగుటకాని, సాధన ఫలము లభించుట కాని జరుగదు కనుకను, శ్రీకృష్ణుఁడే బ్రహ్మగను, పరమాత్మ (ఈశ్వరుఁడు) గను, భగవంతుఁడుగను, సృష్టియందు అనుస్యూతుఁడాయెను. కృష్ణుని బ్రహ్మరూపానుప్రవేశమే పైనిఁ జెప్పిన "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను వాక్యమును, పరమాత్మ రూపానుప్రవేశమే "వాసుదేవ స్సర్వ మిదం" అను వాక్యమును, భగవదనుప్రవేశమే "ఏకోవశీ సర్వ భూతాంతరాత్మా" అను వాక్యమును తెలుపుచున్నవి.

జడదృష్టి విలయమునకు సాధనము సాధన చతుష్టయ మనఁబడి బ్రహ్మోపాసకులగు జ్ఞానులచేఁ జేయఁ బడుచున్నది. అవి వివరించియే యున్నాను. వాక్కును మనస్సుచేతను, మనస్సును బుద్ధిచేతను, బుద్ధిని బుద్ధిసాక్షియగు సోపాధిక బ్రహ్మముచేతను నిగ్రహింపవలయును. సోపాధిక బ్రహ్మమును, అనగా ప్రత్యగాత్మను నిరుపాధిక బ్రహ్మమగు శ్రీకృష్ణునియందు లయింపఁ జేసి నప్పుడు పరమశాంతి లభించుటే కాక జడదృష్టి పూర్తిగ నశించి అధిష్ఠానము (శ్రీకృష్ణుఁడు)ను, ఆరోపితము (జగత్తు)ను, బ్రహ్మ (చిద్వస్తువు)గనే గోచరించును. జడదృష్టి విలయమునకు మఱియొక సాధనము అష్టాంగయోగమనఁబడి ఈశ్వరోపాసకులగు యోగులచేఁ జేయబడుచున్నది. అదియు వివరించియే యున్నాను. అయిదు బహిరంగములు, మూఁడంతరంగములు కల సాధనచే ఉపనిషత్ప్రతిపాదితమగు జీవపక్షి (జడముగ దోఁచు సంసారము) ఈశ్వరపక్షి (పరమాత్మ) యందు లయించి నీడ అసలునందుఁ జేరిన విధమున జడదృష్టి నశించి పరమాత్మ స్వరూపుఁడగు శ్రీకృష్ణుఁ డొక్కఁడే, అనగా కైవల్యస్థితియే, గోచరించును. ఈవిధముగఁ దమతమ సాధనలయందు ఉత్తీర్ణులైనజ్ఞానులకు, యోగులకు, శ్రీమూర్తి పూజనమేల ? వారికి సమస్త సృష్టియు చిన్మయముగనే గోచరించును. వారికిసర్వథా ఆత్మసాక్షాత్కారమే లభించుచున్నది. కాని ఈ సాధనలయందు అసమర్థులగు వారికి జడదృష్టి నశించుటకును, సర్వత్ర ఆత్మదృష్టి కలుగుటకును, ఉపాయాంతరము వలదా ?

అర్చామూర్తి యోగ భక్తి సాధనలకు సహకారి

శక్తి వికారములగు ఇంద్రియములు. అంతఃకరణము, స్థూలదేహము మున్నగునవి రజస్సంబంధము కలిగి యుండుట వలన చలతత్త్వములై యున్నవి. శక్తిమంతుడగు శ్రీకృష్ణుడే నిశ్చలతత్త్వము. చలతత్త్వములు నిశ్చల తత్త్వముచేత నిగ్రహింపఁబడినప్పుడే తమ చంచలత్వమును వీడి తమమూల తత్త్వము యొక్క చిన్మయావస్థయు, శుద్ధసత్త్వావస్థయుఁబొంది తమ ప్రత్యేకస్థితిని పూర్తిగాకోల్పోవుచున్నవి. దేహేంద్రియ మనోబుద్ధుల చంచలత్వము వదలుటకు యోగశాస్త్రమందు ఏకాగ్రతా సాధనము చెప్పఁబడెను కదా? "తత్ప్రతిషేధార్థమేక తత్త్వాభ్యాసః" అని పతంజలి ఋషి చెప్పుటచేత అంతఃకరణము తన చంచలత్వమును వదలించుకొనుటకు ప్రథమ సాధనముగ ఏదేనొక వస్తువునందు ఏకాగ్రత నభ్యసింపవలయునని చెప్పినట్లే గదా? మఱియు "యథాభిమత ధ్యానాద్వా" అనుటచే అంతఃకరణమున కిష్టమగు ఏ శ్రేష్ఠమగు వస్తువునందైన ఏకాగ్రతాభ్యాసము చేయవచ్చుననెను కదా? అట్టి ఏకతత్త్వము, అభిమతవస్తువు అర్చామూర్తి ఏల కాగూడదు? సాధకుడు అర్చా విగ్రహమునందు ఏకాగ్రతాభ్యాసము చేయునపుడు చిత్తము చంచలత్వము వీడి ఒకచోట నిలుచుట కలవాటుపడును. భగవద్విశ్వాసము (ఆస్తికత), భక్తితత్పరత్వము, ప్రార్థన బలముగల సాధకుడు తన సరళాశ్రువులచే అర్చామూర్తియందు భగవంతుని ప్రసన్నుని జేసికొనును. ఎట్లనిన, సరళాశ్రువులు సాధకుని అంతఃకరణము నందలి మాలిన్యము పూర్తిగ కడిగివైచి దానిని శుద్ధమొనర్చును.

శుద్ధాంతఃకరణమే కదా బ్రహ్మానుభవమునకుఁగాని, ఈశ్వర సాక్షాత్కారమునకు గాని, భగవద్దర్శనమునకుగాని ప్రధాన సాధనము? భక్తితత్పరుఁడై మనోనిగ్రహము కలిగి భగవద్దర్శనము కొఱకు దృఢసంకల్పముచేసి అర్చామూర్తికి నమస్కరించుచు సహజసమాధి నిష్ఠులై సదా భగవన్నామ సంకీర్తన చేయువారు శుద్ధసత్వ సంపన్నులగు మహాత్ములని గీతల యందుఁ జెప్పఁబడినది. కావున అర్చా విగ్రహమునందు ఏకాగ్రతాభ్యాస ఫలముగ చిత్తవృత్తిరాహిత్యము, అంతః కరణశుద్ధి, తత్ఫలముగ సహజసమాధియు శుద్ధాంతఃకరణము నందు భగవద్దర్శనమును లభించుచున్నది.

పైనిదెల్పిన విధముగ యోగసాధన కష్టాతికష్టమును, శ్రీ విగ్రహమూలమున భక్తిసాధన మిగుల సులభమును అగుచున్నవి. సమాధిస్థితియందు, ఈశ్వరసాక్షాత్కారముగాని భగవద్దర్శనముగాని లభింపకుండ ప్రపంచమునందలి ఏ పదార్థమందును, ఆత్మదర్శనము చేయుటకు అవకాశమే లేదు. కఠినమగు యోగసాధన చేయలేనివారు "సర్వభూతేషు చాత్మానామ్" అనఁగా, సర్వభూతముల యందును ఆత్మదర్శనము చేయఁగోరుదురేని శ్రీ విగ్రహమూలమున భక్తి సాధనచేఁ దత్ఫలమును సులభముగఁ బొందఁగలరు. ఆత్మదర్శనము సర్వత్రలభింపనివారు భగవత్సేవగాని లోకసేవగాని చేయుటకు అనర్హులగుచున్నారు. పారమార్థిక జీవనము అలవడనివారు నిరహంకార వృత్తితో ప్రజాసేవ చేయుటకు నిస్సహాయి అసమర్థు లగుచున్నారు.

త్రివిధజ్ఞానము ననుసరించి శ్రీమూర్తి పూజనము.

గుణత్రయ విభాగము ననుసరించి జ్ఞానవృత్తి మూఁడు విధములని గీతయందుఁ జెప్పఁబడినది. తామసజ్ఞానము, రాజసజ్ఞానము, సాత్త్వికజ్ఞానము—ఇవియే జ్ఞానత్రయము. ఇది శ్రీమూర్తితత్త్వమందు బాగుగ నన్వయించును. తామసజ్ఞానము కలవారు సమస్తమును స్థూలదృష్టినే చూతురు. అర్చామూర్తి వారికి రాయియో, దారువో అగుచున్నది. రాయియే దేవుఁడని వారి భావన. ఈ ప్రతిమకంటె వేఱొక ఆత్మగాని, ఈశ్వరుఁడుగాని లేఁడని వారు చెప్పెదరు. ఈశ్వరుని దారుపాషాణమాత్ర పరిమాణము గలవానిగ వారు భావింతురు. యుక్తిరహితమై, యథార్థరహితమగు ఈ జ్ఞానము తుచ్ఛ ఫలప్రదమగుచు ఆత్మతత్త్వమును పూర్తిగ విస్మరింపఁ జేయుచున్నది. రాజసజ్ఞానము కలవారు సమస్తవిషయములను సూక్ష్మదృష్టితోఁ జూతురు. అర్చామూర్తిని వారు శిలగాఁగాని దారువుగాఁగాని భావింపరు. శిలాంతర్వర్తియే వారికి దేవతామూర్తి. కాని ఒకశిలయందలి మూర్తి రాముఁడైనచో, ఇంకొక దారువునందలి మూర్తి నృసింహదేవుఁడు. ఒక శిలయందలి మూర్తి ఆంజనేయుఁడైనచో, ఇంకొక శిలయందలి మూర్తి సుబ్రహ్మణ్యుఁడు. ఈ విధముగ వారు వివిధ దేవతాజ్ఞానము కలిగి తమ తమ సంసారములకు ఉన్నతి లాభము కోఱకును, తుష్టిపుష్టుల కోఱకును ఆయా దేవతలను పూజింతురు. వారి జ్ఞానము ఇట్లు భిన్నప్రకారములు కలదగుటచేత ఏకమాత్రవస్తువగు ఆత్మతత్త్వమును భేదబుద్ధిచేతనే వారు తెలిసికొనుచున్నారు. సాత్త్వికజ్ఞానము కలవారు సమస్తభూతములను ఆత్మదృష్టితో

జూతురు. అర్చామూర్తి యందువారికి ఆత్మస్వరూపమే గోచరించును. ప్రత్యేక రూపములుగల శ్రీ విగ్రహములందు నాశరహితమైనదియు, అఖండమైనదియు నగు పరమాత్మ తత్త్వమొక్కటే అనుస్యూత మయ్యెనని వారు తెలిసికొందురు. రాజసజ్ఞానము కలవారలకు ఆంజనేయ విగ్రహమందు ఆంజనేయుడును, సుబ్రహ్మణ్య విగ్రహమందు సుబ్రహ్మణ్యుడును మాత్రమే గోచరింతురు. ఏమన, సంసారములందలి అభావముల నివృత్తికొరకు ఆ దేవతలదగు ప్రత్యేక జ్ఞానస్థితి రాజసవృత్తిగల మానవులకు అత్యంతోపయుక్తమగుచున్నది. శత్రుజయము కావలసినప్పుడు ఆంజనేయు నుపాసింతురే కాని స్సుబ్రహ్మణ్యస్వామి నుపాసింపరు. సంతానము కొఱకు సుబ్రహ్మణ్యస్వామి నుపాసింతురే కాని అంజనేయుని తలంపరు. ఇట్టిభేదజ్ఞానము సాత్త్విక జనులకుండదు. అన్ని దేవతామూర్తుల యందును వారలు ఆత్మజ్ఞానమునే గలిగియుందురు. ఆయామూర్తులను వారు భగవంతునిగనే ఉపాసింతురు. వారికి గల ఆత్మదృష్టియే యిందులకుం గారణము. కావుననే శ్రీమూర్తి పూజనమునకు ఆత్మదృష్టియే చరమ ఫలమనిచెప్పంబడినది. దేవతాబుద్ధితో మూర్తిపూజ యొనర్చిన వారలకు ఆయామూర్తుల నారాధించెడి శ్రద్ధ తానే కల్గించుచున్నాననియు, శ్రద్ధతో ఆరాధించుటచే ఆ దేవతలు వారలకు ఈయవలసిన ఫలము తానే అనుగ్రహించుచున్నాననియు, శ్రీకృష్ణుడు గీతలయందుం జెప్పెను. కాని ఆ ఫలము అంతవంతముగుటచే దేవతాభక్తులు ఆయా దేవతలనే పొందుదురని స్పష్టముగం జెప్పెను. ఇంతేకాక అన్యదేవతలను భజించువారుకూడ తననే అవిధిపూర్వకముగ భజించుచున్నా

రనియు తనను యాగభోక్తగను, మహేశ్వరునిగను తెలియఁ జాలక ఆ దేవతోపాసకులు దేవతలనే పొందుచున్నారనియు, పితరులను గొల్చువారు పితృదేవతలనే పొందుదురనియు, ఱాలను, దారువులను ఆరాధించువారు ఆయా రూపములనే పొందుదురనియు, తన్ను గొలుచువారు మాత్రము తననే పొందుదురనియు కూడ చెప్పెను.

వ్యక్తోపాసనము, అవ్యక్తోపాసనము

ఆత్మనిష్ఠగల జ్ఞానులకును, యోగులకును శ్రీమూర్తి పూజనమువలనఁ బొందవలసిన ఫల మెద్దియు లేదని ముందె చెప్పఁబడెను. అవ్యక్తోపాసకులగు వారలకు వ్యక్తోపాసనమగు శ్రీవిగ్రహారాధనముతో అవసరముండదు. వారు దానిని పొందెడు స్థితిలో నున్నను వ్యక్తోపాసనమును నిష్కృష్టముగనే వర్జింతురు. వారి మాటల యందు ప్రమాణబుద్ధికలిగి జ్ఞానమార్గ యోగమార్గము లందర్హత లేనివారు అవ్యక్తోపాసనము చేయ నారంభించి ఫలము నొందఁజాలక చ్యుతులగుచున్నారు. వారు వ్యక్తోపాసనము చేయకుండుటకుఁ గారణము తమకు ఆదర్శప్రాయులగువారు అవ్యక్తోపాసనము చేయుటయు, వారు అదే శ్రేష్ఠమగు మార్గమని తమకుఁ జెప్పుటయును. శ్రేష్ఠుఁడగువాఁడు ఏ క్రియాచరించునో ఇతర జనులు దానినే ఆచరింతురనియు, శ్రేష్ఠునికిఁ బ్రమాణమైన దానినే లోకు లనువర్తింతురనియు గీతలు మనకుఁ జెప్పుచున్నవి. కావున లోకులను మంచి మార్గమందుఁ బ్రవర్తింపఁ జేయుటలో నాయకులగు వారికి చాలబాధ్యత గలదు. అర్చామూర్తి యేదైనను దాని యందుండువాఁడు సర్వవ్యాపియగు పరమేశ్వరుఁ డొక్కఁడే.

యని భావించి చేయఁబడిన భక్తియే యథార్థమగు వ్యక్తోపాసనము. తన యందు మనస్సు నిలిపి సమాహితచిత్తులై పరమ శ్రద్ధతోఁదన్ను ఉపాసించువారే అందఱిలో ఉత్తములగు వారని చెప్పి శ్రీకృష్ణుఁడు వ్యక్తోపాసనముయొక్క శ్రేష్ఠత్వమును గీతలలో నిరూపించెను. అంతేగాక దేహధారులును వ్యక్తులును అగు మానవులకు అవ్యక్తోపాసనా మార్గము కష్టముచే సిద్ధించుచున్నదనియు కూడ చెప్పెను. ఈ విషయము తెలిసిన నాయకశ్రేష్ఠులు జ్ఞానమార్గ యోగమార్గములందు అర్హత లేని వారలను వ్యక్తోపాసనమందే ప్రవర్తింపఁ జేయవలెను. అజ్ఞానముచే అర్చారూపమును శిలగా భావించువారలకును, వివిధ దేవతాబుద్ధితో శ్రీవిగ్రహ పూజన మొనర్చుచు తమ సంసారమునకు ఉన్నతిలాభము వాంఛించు కర్మాసక్తి పరులకును, వ్యక్తోపాసనమందు వారికిఁ గల ఆసక్తిని వదలించి అవ్యక్తోపాసనమందుఁ బ్రవర్తింపఁజేయుట వారికి బుద్ధిభేదము కలిగించుట. ఇట్టి బుద్ధిభేదము కలిగింపకుండ అజ్ఞానులకు శ్రీవిగ్రహతత్త్వము బోధించియు, కర్మ సంగులకు దేవతాభేద బుద్ధి వదలించి ఒక్కఁడగు పరమేశ్వరుని స్వరూపమునే వారు శ్రీమూర్తి యందు గనునట్లు చేసియు, వారికి వ్యక్తోపాసన మందుగల ఆదరమును పెంపొందించవలెను. వారలొకవేళ తమకు అవ్యక్తోపాసనమును ఉపదేశింపుమని కోరినను దాని యందుగల అధికతర క్లేశమును వారికి బోధించి వ్యక్తోపాసన మందు వారికి గల బుద్ధిని స్థిరపర్చవలెను. "మాకు వ్యక్తోపాసన చెప్పి నీ వేల అది చేయవు?" అని వారు ప్రశ్నింపవచ్చును. ఇది యుక్తమే. శ్రేష్ఠులగు వారి వర్తన ననుసరించుట జన సామాన్యమునకు సహజలక్షణమని శ్రీకృష్ణుఁడే చెప్పెగదా ?

కావున నాయకుడగువాడు తానితరులకు బోధించునవి తానాచరించి తీరవలయుననునదే గీతా సిద్ధాంతము. ఇట్లను టచే జ్ఞానియేకానీ, యోగియేకానీ తమ అవ్యక్తోపాసనతోపాటు లోకసంగ్రహము కొఱకు వ్యక్తోపాసనము, అనగా శ్రీ విగ్రహారాధనము అజన్మాంతము చేయవలయుననే తేలుచున్నది. కావుననే మహాయోగియగు భర్తృహరి అవధూతావస్థ యందుండియు తాను నిత్య మాచరించు ధ్యానయోగముతో పాటు బాహ్యపూజారూపమగు శివ విగ్రహారాధనము ఆమరణాంతము చేయుచుండెను. అతని వాక్యము లివి: "స్నాత్వాగాంగైః పయోభిః శుచి కుసుమఫలై రర్చయిత్వా విభో! త్వాం, ధ్యేయే ధ్యానం నియోజ్య క్షితిధర కుహరగ్రావ పర్యంక మూలే, ఆత్మారామః ఫలాశీ గురువచన రతః త్వత్ప్రసాదాత్ స్మరారే!, దుఃఖం మోక్ష్యే కదాహం సమకరచరణే పుంసి సేవాసముత్థమ్" 'ప్రభూ! గంగా స్నానముచేసి (బహిర్యాగ రూపముగ) ఫలపుష్ప ములతో నిన్ను పూజించి ఆత్మారామ స్థితినుండి పర్వత గుహాంతరమున ఒక ఱాతి పలకపై ఆసీనుడనై (అంతర్యాగ రూపముగ) నిన్నే ధ్యానింపుచు నీ యనుగ్రహము వలన సంసార దుఃఖములనుండి యెప్పుడు విడివడుదునో కదా!'

అవ్యక్తోపాసనచేసి ఆత్మానుభవ లాభమునొంది సదా ఆత్మారాములై ఆత్మయందే తృప్తిగల వారలకు తమ కొఱకని చేయవలసిన పనులేమియు నుండవు. ఒకపనిచేయుట వలన తమకు లభింపవలసినది కాని, లభింపదగినదికాని యేదియు లేదు. ఒకపని చేయకపోవుటవలన కలుగు నష్టమును లేదు. ఏమన, ఫలము నాసించి అతడాశ్రయింపవలసిన దెద్దియు లేదు

ఈ కారణముచేతనే ఆత్మదృష్టి కలవారికి శ్రీ విగ్రహారాధనము వలన ప్రయోజనము లేదని చెప్పబడెను. కాని ఆత్మారాములు శ్రీ విగ్రహారాధనము పొత్తుగ వదలినచో అవ్యక్తోపాసనము చేయజాలరని సామాన్యజనులు తమకు ఆదర్శ ప్రాయులు త్యజించిన వ్యక్తోపాసనము తాముకూడ త్యజించి రెంటికి చెడుదు రనుటలో సందేహమేలేదు. కావుననే ఆత్మారాములకు జ్ఞానులకును యోగులకును లోక సంగ్రహదృష్టి అత్యంతావశ్యకమని గీతలలో శ్రీకృష్ణుడు నుడివెను. లోక సంగ్రహ మనగా సర్వజగత్తును సన్మార్గమందు ప్రవేశపెట్టి దానికి నాశము కలుగకుండ శ్రేష్ఠమగు విధమున లోకధారణ పోషణాదులను చేయుట. ఆత్మారాములకు లోక సంగ్రహబుద్ధి కలిగినప్పుడే తాము అవ్యక్తోపాసకు లయ్యును పైని జెప్పిన విధమున సామాన్యజనులు ఉభయభ్రష్టులగుదు రను కారణము వలన దమకు సహజసిద్ధమగు సర్వభూత హిత రతత్వమును ఆచరణయందు పెట్టి తామును వ్యక్తోపాసనచేసి తదుపాసనా పరులను సంతోషపూర్వకముగ ఆపని చేయునట్లు చేయవలెను. శ్రేష్ఠుడు చేసినపని యితర జనులు మిగుల శ్రద్ధతో చేయుదురు కనుక ఆత్మారాములు వ్యక్తోపాసన చేసినప్పుడే జనసామాన్యమునకు దానియందు ఆదరబుద్ధి కలుగుచున్నది. కావున జ్ఞానులును, యోగులును వ్యక్తోపాసనా రూపమగు శ్రీ విగ్రహారాధనము చేసియే తీరవలెను. మహాయోగియగు భర్తృహరియును, పరమహంసయగు శ్రీ రామ కృష్ణుండంతవారును, శ్రీమూర్తి పూజన మెందుకు చేసిరో మనమిప్పుడు తెలిసికొనగలము. నిరంతరము అరణ్యావాస మొనర్చెడి యేకాంతుల విషయమెట్లున్నను, లోకసంగ్రహము

కొలకు పట్టణములలో గొప్ప జ్ఞానులును, యోగులును శ్రీవిగ్రహార్చనము నభివర్ణించలేని వారు స్వానుభవప్రాయము నకు వ్యతిరేకముగ నడచువారే అని నా ముఖ్యముగ జ్ఞప్తియందుంచు కొనవలెను.

# III

కృతయుగ లక్షణములు.

సృష్టియొక్క ఆరంభదశకు కృతయుగమని పేరు. కృత యుగమునకు సత్యయుగమను నామాంతరము కలదు. దీనికి పారమార్థిక యుగమనియును అందురు. ఏమన, ఈ యుగవాసులకు చిన్మయమగు ఆత్మసృష్టి తప్ప జడసృష్టి లేశమైన నుండదు. సృష్టికి గారణములగు సత్త్వరజస్తమో గుణములలో ఈ యుగమందు సత్త్వవృద్ధి అపరిమితముగ నుండును. ప్రకాశమే సత్త్వలక్షణమగుటచేత కృతయుగము నందలి ప్రతిసృష్ట పదార్థమును ప్రకాశవంతముగ నుండును. జడపదార్థమని మనము దేని నందుమో, అది యీ సత్య యుగమున ఆకాశతత్త్వభూయిష్ఠముగ నుండుటచే దీపమునకు నిర్మలమగు నద్దము ఆవరణగ నున్న విధమున, చరాచర ప్రపంచమునందు అంతర్యామిగ నున్న ఆత్మ తత్త్వమునకు ప్రకాశవంతములగు స్థూలసూక్ష్మాకాశములే స్థూల సూక్ష్మా వరణలుగ నేర్పడును కావున, ఈ యుగమందు అన్ని స్థావర జంగమ పదార్థములును ఆత్మ ప్రకాశముతో నిండి చూచు వారలకు జ్యోతిర్మయములుగ దోచునే కాని జడమయము లుగ గన్పట్టవు. ఇక సత్యయుగవాసులగు స్త్రీ పురుషులు ఎంతటి ఆత్మవంతులో, ఎంతటి చిన్మయదృష్టి కలవారో

నేను వేఱే చెప్పవలసిన పనిలేదు. రజస్తమస్సుల యొక్క ప్రభావము వారల శరీరములందు పొడచూప కుండుటచే వారల దృష్టి సదా ఆత్మయందే నిలుచును కాని బహిర్ముఖము కాదు. వారలెఱింగినది ఆత్మానందమే. కామదృష్టి వారుండదు. ఐహికమగు లజ్జకు కామదృష్టియే కారణమగుట చేత సత్యయుగవాసులు దేహలజ్జలేక దిగంబరులై యుందురు. ఇంతేకాక సత్యయుగమందు వాతావరణముకూడ సాత్త్వికముగ నుండును కావున శీతోష్ణ బాధలు సత్యయుగము వారికి కలుగవు. సత్యయుగమందు నిత్యవసంతమే ప్రవర్తించుచుండును. సంవత్సరమంతయు వసంతమే; రాత్రి వాసంతిక రాత్రియే; పవలు వాసంతిక దినమే. ఉష్ణబాధలేని వెచ్చదనము, శీతబాధలేని చల్లదనము, ఓరుగాలిలేని మందమారుతానందము వారు సదాఅనుభవించుచుండుటచే వారి శరీరములు ఎట్టి ఆవరణమును కోరవు. ఈ కారణముచేత కూడ వారు దిగంబరులై యుందురు.

సత్యయుగమందు గృహనిర్మాణ పద్ధతిలేదు. ఏమన, ఆయుగవాసులకు గృహావాసముతో పనిలేదు. వారి దిగంబరత్వమునకు గారణములగు ఆత్మారామత్వము, కామ దృష్టి రాహిత్యము, సాత్త్విక వాతావరణము అనునవియే వారికి గృహములు లేకుండుటకు గారణము లగుచున్నవి. కామ సంతర్పణమును వాంఛించు దంపతులకును, శీతోష్ణబాధలు కలవారలకును గృహము లావశ్యకములు కాని ఆత్మారాములగు కృతయుగవాసులకు గృహములతో పనిలేదు. వారెచ్చట నివసింతురో అదే వారిగృహము. భర్తృహరి చెప్పినట్లువీరికి, "మహీరమ్యాశయ్యా విపుల ముపధానం భుజలతా, వితానం

చాకాశం వ్యజన మనుకూలోయ మనిలః, స్ఫురద్దీపశ్చంద్రః॥
'భూమియే విశాలతల్పము; బాహువే పెద్ద తలదిండు; ఆకాశమే ఛాందినీ; అనుకూలవాయువే వింజామర: చంద్రుడే దీపము.' వీరి సౌధములు లతానికుంజములే. వసుధ అంతయు వీరి కుటుంబమే.

కృతయుగము నాలుగువేల దివ్యవర్షములు పరిమితి కలది. అందు మొదటి వేయిసంవత్సరములలో ప్రజల చిన్మయదృష్టి నిశ్చలముగను, రెండవ వేయిసంవత్సరములలో అది అప్రతిహతముగను, ఉండును. కారణమేమనగ, రజస్సునకు కొంచెమైన తలయెత్తుటకు దానివృత్తిగ అవకాశము కలిగినంతవరకు సత్వసమృద్ధి ఈ రెండువేల దివ్య సంవత్సరములందును కలిగియుండును. మూడవభాగమగు వేయిసంవత్సరములలో ప్రజల చిన్మయదృష్టి యీషత్ప్రతిహతముగ నుండును. అయినను దీని ఫలము కృతయుగవాసుల చిత్త వృత్తిని బాధింపక వారల ఆచార విధులందును, బహిర్వర్తన మందును గోచరించును. ఈ కాలమునందే రజస్సునకు ఒకింత తలయెత్తుట కవకాశము కలుగును. నాలుగవ భాగమగు వేయి దివ్యవర్షములలో ప్రజల చిన్మయ దృష్టి చలించునే కాని వారి చిత్తవృత్తి బలవత్తరముగనే ఉండును. సత్వము నొకింత తిరస్కరించి రజస్సు పనిచేయ నారంభించును. ఈ కాలమందు ప్రజలకొకింత బహిర్ముఖవర్తనము అవతరించును. కృతయుగ సాయంసంధ్యాంశ యగు నాలుగు వందల దివ్య వర్షములలో రజోగుణమునకు అధికారము మెండగుటచే ప్రజలు పూర్తిగ బహిర్ముఖులగుదురు. ప్రజలకిప్పుడు ఆత్మ దృష్టితగ్గి భోగదృష్టి ప్రబలును. భోగానుభవము కొరకు

వారప్పుడు గృహములు నిర్మించుకొందురు; వస్త్రధారణము చేయుదురు; గృహకార్య నిర్వాహణమందు ఆసక్తి కలిగి యుందురు.

కృతయుగమందు గృహనిర్మాణమే లేనప్పుడు దేవతా గృహ నిర్మాణము అసంభవమే కదా?

కృతయుగమందు దేవాలయములున్నవా?

ప్రజల చిత్తప్రవృత్తి బలవత్తరముగ నుండి ధర్మము నాలుగు పాదముల నడచు కాలమున ఆత్మసాన్నిధ్య మందఱికిని సులభసాధ్యముగ నుండును. కావున కృతయుగమునకు అవతారప్రయోజనమించుకయు లేదు. దేవాలయసంస్థ అర్చావతారమునకు సంబంధించిన దగుటచే కృతయుగమున దేవాయతనములు లేవనియే చెప్పవచ్చును. కృతయుగ సంధ్యాంశ యందంకురించిన బహిర్ముఖవర్తనము ధర్మరూప చిత్తప్రవృత్తి ఒక పాదము తఱిగిన త్రేతాయుగమందు మఱింత బలపడుటచే ప్రజలకు ఆత్మ సాక్షాత్కారము అప్పుడు కష్టసాధ్యమగుచుండెను. ప్రేమమయుఁడగు భగవంతుఁడు బహిర్ముఖులకు మఱల ఆత్మదృష్టి కలిగించి వారలను తరింపఁజేయుటకు తానవతరింపవలసి వచ్చెను. సత్యయుగ సంధ్యాంశయందు అవతార ప్రయోజన మొకింత కనుపడినను త్రేతాయుగము నుండియే భగవంతుని లీలావతారములు గూర్చి మనము వినుచున్నాము. వైవస్వత మనుపుత్రుఁడగు ఇక్ష్వాకుఁడు భగవంతుని ధ్యానింప అతఁడు శ్రీరంగనాథ రూపముతో దర్శనమిచ్చెను. ఇది కృతయుగమందే యని కొందఱు చెప్పుదురు కాని శ్రీకృష్ణుఁడు గీతాయోగ ముపదేశించిన వివస్వంతుఁడు ఆ యోగమును తనపుత్రుఁడగు మనువునకును, మనువల్లె

వారిని తపస్సుచేసినందున ఇక్ష్వాకునకు త్రేతాయుగ ప్రారంభమందు ఉపదేశించినట్లు మహాభారత శాంతిపర్వమునందు చెప్పబడియున్నందున ఇక్ష్వాకునకు త్రేతాయుగమందే రంగనాథమూర్తి ప్రాప్తము లభించెనని మన మూహింపవచ్చును. భగవంతుడిక్కడే రూపమున అర్చామూర్తియై ఇక్ష్వాకు వంశమందు చాలకాలము పూజింపబడెననియు, రామచంద్రుడు ఈ మూర్తినే "ఇక్ష్వాకు కులధనము" అని చెప్పి విభీషణునకిచ్చి పూజింపుమని అనతిచ్చెననియు ఏవ్యాఖ్యానము కలదో అదికూడ ఆ యుగమునకు సంబంధించినదే.

భగవంతుని ప్రకాశమూర్తులు, విలాసమూర్తులు

భగవంతుడు తొలుదొల్త పరతత్త్వముగను, తదుపరి చతుర్వ్యూహ వాసుదేవాదిమూర్తులుగను, అవతరించెనని ముందే చెప్పబడెను. వాసుదేవునకు కేశవ, నారాయణ, మాధవనామములుగల మూడు ప్రకాశమూర్తులును, అధోక్షజ పురుషోత్తమ నామములుగల రెండు విలాసమూర్తులును కలవు. సంకర్షణునకు గోవింద, విష్ణు, మధుసూదన నామములు గల మూడు ప్రకాశ మూర్తులును, ఉపేంద్ర, అచ్యుతనామములు గల రెండు విలాసమూర్తులును కలవు. ఇట్లే ప్రద్యుమ్నునకు త్రివిక్రమ, వామన, శ్రీధర నామములుగల మూడు ప్రకాశ మూర్తులును, నరసింహ జనార్దన నామములుగల రెండు విలాస మూర్తులును కలవు. ఇట్లే అనిరుద్ధునికి కూడ హృషీకేశ, పద్మనాభ, దామోదర నామములుగల మూడు ప్రకాశ మూర్తులును, హరి, కృష్ణ నామములుగల రెండు విలాస మూర్తులును కలవు. ఈ విధముగ చతుర్వ్యూహము

పన్నెండు ప్రకాశమూర్తులును, ఎనిమిది విలాసమూర్తులును కలిగి భగవంతుని విభవావతారములకును, అర్చావతారముల కును ఆస్పదమగుచున్నవి. చతుర్వ్యూహములతో సహా యిరువది నాలుగు మూర్తులగు ఈ భగవన్మూర్తులు లోకానుగ్రహము కొఱకు అర్చారూపములువహించి జగన్మండలమున నవతరించెను. మథుర, ప్రయాగ, కాంచి, ఘటికాచలము, పూరీ, అనంతశయనము మున్నగు స్థలములన్నియును ఈఅర్చామూర్తుల చేతనే మహా పవిత్రములగుచున్నవి.

**త్రేతాయుగాది నుండి దేవాయతన నిర్మాణము**

సత్త్వసమృద్ధిగల కృతయుగమునందు జనులందఱును ఒకే కుటుంబముగ నున్నను రజోధికారమునకు లోబడియున్న కృతయుగ సంధ్యాంశయందు వారు బహిర్ముఖ జీవనులై తమతమ గుణకర్మల విభాగము ననుసరించి నాలుగు కుటుంబములగుచు సత్త్వభాగ మింకను బలవత్తరముగ నుండుటచే నాలుగు కుటుంబముల వారును అన్యోన్య సహకారము కలిగి పరమ సామంజస్య బుద్ధితో మెలఁగుచుండిరి. ఈ నాలుగు కుటుంబములే బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రరూప చాతుర్వర్ణ్యము. ఈ నలుతెగల ప్రజలకు బహిర్ముఖవర్తనము నశించి అంతర్ముఖ జీవనము కలిగి వీరుఁ తరించుటకు పైని చెప్పిన చతుర్వ్యూహసంబంధమగు ఇరువదినాలుగు విధముల శ్రీ విగ్రహారాధన నియమింపఁబడెను. సాత్త్వికులును, ఆత్మదృష్టికలవారును అగు విప్రులకు సమంత్రకమగు పూజయు, రజస్తమో లక్షణములు కలిగి, బహిర్ముఖులయ్యును ప్రపత్తిగల క్షత్రియ వైశ్య శూద్రులకు అమంత్రకమగు పూజయు, అనాదిగ, ననఁగా, త్రేతాయుగ

ప్రారంభము నుండియు నిర్మింపబడెను, శ్రీ విగ్రహారాధనము త్రేతాయుగమునుండియే కాని అంతకు ముందు లేదని చెప్పినఁ జెప్పవచ్చును. భగవంతుఁడు శ్రీరామచంద్రుఁడై అవతరింపక పూర్వమే, అయోధ్యయందు "దేవాయతనములు" కలవు. శ్రీరాముని యౌవరాజ్య పట్టాభిషేక కాలమందు హస్తములందు పుష్పమాలలను, అన్నమును, భక్ష్యములును, దక్షిణలును గల కొందఱు వ్యక్తులను దేవాలయములందు వేఱు వేఱుగ నియమింపవలయునని వసిష్ఠవచనము కలదు. ఆకాలమందే తెల్లని మేఘసదృశములతో సమానములగు దేవాలయములను పతాకములతో అలంకరింప వలయునను వాక్యముకూడ కలదు. కైకేయీమూలమున, పట్టాభిషేకము భగ్నమై శ్రీరాముఁడు వనములకై బయలుదేరి పోవుచున్నప్పుడు కౌసల్యాదేవి రామునితో, "పుత్రా! చతుష్పథము లందలి దేవాలయములందు ఏయే దేవతలకు నీవు నమస్కరించుచుంటివో ఆ దేవతలును, వనమందలి మహర్షులును కూడ నిన్ను రక్షింపుదురుగాత" మనియెను. దీనినిబట్టి చూడఁగా రామచంద్రుఁడు కూడ శ్రీమూర్తి పూజ యొనర్చెననుట స్పష్టమేకదా? ఇఁక ద్వాపరయుగమందు దేవాలయములకు కొదువేమి? "మునివ్రత మథ త్యక్త్వా నిశ్చక్రా మాంబికా గృహాత్" మౌనముద్ర విడిచి గౌరీ దేవ్యాలయమునుండి వెడలి వచ్చిన రుక్మిణినే కదా శ్రీకృష్ణుఁడు హరించి వివాహము చేసికొనెను? "పృథివీ న దేవగృహ భూషితా భవిష్యతి యుగక్షయే" కలియుగాంతమందు భూమిపై దేవాలయములుండవని మహాభారతమునందుఁ జెప్పఁబడెను కదా? ధర్మము పాదక్రమమున తగ్గుచున్న యుగములందు, అనఁగా,

జనులకు చిన్మయదృష్టి లేకపోయినప్పుడు కూడ ఆ కాలమందు భగవంతుఁడు అర్చారూపుఁడై వెలసి దర్శనమిచ్చుచు ప్రజల సంసార తాపత్రయమును, కష్టములను నివారించుచునే ఉండును. ఆత్మీయులకు సర్వవినాశకరమగు మహాభారతయుద్ధమును చూడనొల్లక తీర్థయాత్రలకుఁబోయిన శ్రీకృష్ణాగ్రజన్ముఁడగు బలదేవునకు మనశ్శాంతి నొసంగినది శ్రీశైలము, వేంకటాచలము, శ్రీరంగము, కన్యాకుమారి మున్నగు స్థలములందలి అర్చామూర్తుల దర్శనమే కదా?

శ్రీ విగ్రహారాధనము భగవంతుఁడే యుపదేశించుట

స్థావరజంగమరూప ప్రపంచమంతయు భగవత్స్వరూపమే అయినను తన్ను నమ్ముకొన్న భక్తులకు అట్టి విశ్వాసము బలపడుటకు భగవంతుఁడు విశేష సంకల్పముతో ఏ భౌతిక రూపము వహించునో అది కూడ అర్చయే అగుచున్నది. ఇంద్రుని గర్వము పోగొట్టుటకై శ్రీకృష్ణుఁడు ఇంద్రయాగము కొఱకు యాదవులు సమకూర్చిన ద్రవ్యములతో వారిచే పర్వతపూజ చేయించెను. తన వారికి విశ్వాసము కలుగుటకై తానే పర్వతరూపము వహించి యింద్రయాగపు సంబారములనన్నిటిని భక్షించెను. మఱియు, పర్వతరూపము వహించిన తననే తాను తనవారితో సహా నమస్కరించి వారితో, "చూచితిరా? ఈ పర్వతమెట్లు మానవరూపము వహించి మనల ననుగ్రహించినదో!" అని వచించెను. మఱియు నది కామరూపిణి యనియు, తనను పూజింపనియెడల మనలనేదో ఒక రూపము వహించి హింసించుననియుకూడ చెప్పెను. ఇదే గోవర్ధన పర్వతము. ఇది భగవత్స్వరూపమగుటచే నిగ్రహానుగ్రహ శక్తులు

కలదానిగా భగవంతుడు నిరూపించెను. అర్చారూపియగు భగవంతుని స్వభావ మిట్టిదే కదా? భాగవతులకు గోవర్ధనగిరి సన్నిధానము వంటిదని చెప్పఁబడినది. లోక సంగ్రహము కొఱకు అర్చామూర్తియైన తన్ను తానే నమస్కరించిన శ్రీకృష్ణుఁడు కలియుగాంతమున యోగమార్గమును పునరుద్ధరించుటకు కాలప్రతీక్షణము చేయుచున్న మహాయోగీశ్వరుఁడగు ఉద్ధవునకు కూడ "నీకిదే చరమోపాయము" మనుచు చెప్పి అర్చామూర్తి పూజనరూపమగు భగవదారాధన విధి ఉపదేశించుటలో ఏమి వింతగలదు? అర్చ శిలామయము, దారుమయము, లోహమయము, మృచ్చందనాది మయము, చిత్రమయము, సికతామయము, మనోమయము, మణిమయము నని ఎనిమిది విధములుగ నుండుననియు, భగవత్ప్రతిష్ఠా రూపమగు ఆయర్చ మఱల చలమనియు, అచలమనియు రెండు విధములుగ నుండుననియు చెప్పెను. అర్చారూపియగు తన్ను మంగళప్రదములగు ద్రవ్యములతో ఆరాధింపవలసి యున్నను తన యందు అపరిమిత తాత్పర్యముగల భక్తుడు తనకు దొరికిన ఎట్టి ద్రవ్యములతో పూజించినను, లేక కేవల మనోభావముతో పూజించినను తృప్తుఁడ నగుదునని శ్రీకృష్ణుఁడు చెప్పెను. తన భక్తుఁడు తన్ను జలమాత్రముచే పూజించినను తన కత్యంత ప్రీతికలుగునని వచించెను. పైనిఁ జెప్పిన అష్టవిధమూర్తులలో ఎప్పుడు దేనియందు శ్రద్ధకలిగి తన్ను దానియందు పూజించినను తనకు సమ్మతమే యనియు, తాను సర్వాత్మకుఁడగుటచే సర్వభూతములయందును, తన యందునుకూడ నుండుననియు ఉద్ధవునికి చెప్పెను. ఇంతేకాక, అర్చారూపియగు తన్ను ప్రతిష్ఠించి, తనకు మందిరము

కల్పించి, పూజాదులకు రమ్యములగు పుష్పవనము లేర్పఱచి నిత్యపూజకొఱకును, పర్వోత్సవ మహోత్సవాదుల కొఱకును చాలినన్ని క్షేత్రాదు లీయవలయుననియు చెప్పెను. పూజా మహోత్సవాదులకు క్షేత్రాదుల నిచ్చుటచే సాలోక్య ముక్తియు, అర్చా ప్రతిష్ఠాపనచే సార్వభౌమత్వము, దేవాలయ నిర్మాణముచే త్రిలోకాధిపత్యము ఫలములుగ జెప్పెను. తనయందు అనన్యభక్తి గలవాఁడు తననే పొందుననెను. మఱియు నొకరిచ్చినట్టివి కాని, ఇతరులిచ్చినట్టివి కాని దేవ బ్రాహ్మణ వృత్తులను హరించువాఁడు పదికోట్ల జన్మములు క్రిమిభోజియై జీవించుననియు, ఈ విషయమందు కర్తయు, కారయితయు, ప్రేరకుఁడును, అనుమోదకుఁడును ఫలము సమభాగములుగ ననుభవింతురనియు చెప్పి ఈ విధముగ ఉద్ధవునికిఁ గృష్ణుఁడు దేవాలయతత్త్వమహత్త్వమును విశదీకరించెను.

పూర్వపు ఋషులు విగ్రహారాధకులా ?

సహజసమాధి లబ్ధమగు భగవంతుని చిన్మయ స్వరూపమును నిరూపించెడి ప్రతిమ శ్రీమూర్తి యనియు, బుద్ధిచేఁగల్పింపఁబడిన ప్రతిమ పౌత్తళికతకు, అనఁగా బొమ్మల పూజకు సంబంధించిన దనియు ముందే చెప్పఁబడెను. బొమ్మలపూజయే విగ్రహారాధన. దేవుఁడు నిరాకారుఁడై నప్పుడు అట్టి నిరాకార దేవునికి లోహాకారము, శిలాకారము మున్నగు రూపములు కల్పించి పూజించుట ఎట్లు విగ్రహారాధన కాకుండును ? కాని నిరాకారశబ్దమున కేమి యర్థము? భగవంతుడు నియమబద్ధమైనట్టియు, ఒకే విధము గలిగినట్టియు ఆకారము గలవాఁడు కాడనియు, తన ఇచ్ఛననుసరించి అతఁడు అనేకరూపములు

ధరించును గాని మన యిచ్ఛానుసారముగ మనకు నచ్చిన ఒకా
నొక రూపము ధరింపఁ జేయుటకు గాని అతని కొఱకు ఒక
రూపము కల్పించుటకుగాని మనవలన సాధ్యమైన పని
కాదనియు, తన నిరంకుశ వృత్తిననుసరించి భగవంతుఁడు
ఏయే రూపములతో నవతరించునో అవి స్థూలదృష్టికి జడ
మయములుగ దోఁచినను ఆ రూపములన్నియు కేవల చిన్మయ
స్వరూపములే యనియు మనము ముఖ్యముగ గ్రహియించు
కొనవలెను. దేవుఁడు తన చిన్మయతత్త్వమునకు సంబంధించిన
స్వరూపములను ధరించుటకు కూడ శక్తిలేనివాఁడై నిత్యనిరా
కారస్థితియే అతనికి ఏకమాత్ర శరణాగతియైనప్పుడు సర్వ
గతుఁడును, సర్వాత్ముఁడును అనంతుఁడు, మనస్సునకు,
వాక్కునకు గోచరింపని వాఁడయ్యును ఆత్మసాక్షాత్కారాభి
లాషులచే మనస్సుచేత నేకదా ధ్యానింపఁబడుచున్నాఁడు?
ప్రతిమ ఎనిమిది విధములు కలదని [illegible] చెప్పినవానిలో ఏన
వది మనోమయ ప్రతిమయే కదా? మనోమయ ప్రతిమ
యందు ఆత్మసాధనము చేయువారు మంద బుద్ధులా? లేక
శిలామయ ప్రతిమ యందు భగవత్సాధనము చేయువారు మంద
బుద్ధులా? “ప్రతిమాస్వల్పబుద్ధీనాం” మనఁగా విగ్రహారాధనము
మంద బుద్ధులకు అను ఈ వాక్యము ఆత్మసాధనచేయు
బ్రహ్మోపాసకుల కన్వయించునా? భగవత్సాధన చేయు
భగవదుపాసకుల కన్వయించునా? ప్రపంచమున కంతటికిని
జ్ఞానజ్యోతిని ప్రసాదించిన మన పూర్వపు ఋషులు తాము
బొమ్మల పూజ సేయుదురా? మన చేత చేయింతురా? మనో
మయ ప్రతిమయందు గాని, శిలామయ ప్రతిమయందుగాని
చిత్తత్త్వగ్రహణమే వారికి ప్రధానాంశమై యుండెను కాని

జడమయములగు మనస్తత్త్వమును కాని, పార్థివ తత్త్వమును కాని వారు పూజింపలేదు.

శ్రీవిగ్రహపూజకు ఫలదాత భగవంతుఁడు

స్వయం వ్యక్తములు, ఋషిస్థాపితములును అగు శ్రీ మూర్తులు మనకుఁ గల భగవద్విశ్వాసము, భక్తితత్పరత్వము, ప్రార్థన బలము ననుసరించి తమ మహాత్త్వమును గోచరింపఁ జేయుచుండునని ముందే చెప్పఁబడెను. కాని యీ మూఁడు గుణములును సహజసిద్ధములై సంపూర్ణముగ నెవరియందు వర్తమానము లగు చుండునో అట్టి వారలకు అర్చామూర్తులయందే కాక చరాచర ప్రపంచము నందలి సమస్త భూతములయందును భగవద్దర్శనము లభించుచునే యుండును. పరమభాగవతుఁడగు ప్రహ్లాదునకు జడమయమగు నొక స్తంభమున భగవద్దర్శనము లభించెను. చిరంజీవిత్వము వాంఛించిన మార్కండేయునకు పైని జెప్పిన యోగ్యతా త్రయమునకు ఫలముగ నొక లింగమున భగవద్దర్శనము లభించెను. కామ్యోపాసకులు ఏయేమూర్తులను శ్రద్ధతో పూజింతురో అట్టి శ్రద్ధవారలకు ఆయా మూర్తులయందు నిశ్చలమగునట్లు భగవంతుఁడే అనుగ్రహించుననియు, వారలు చేయు పూజకు ఫలము భగవంతుఁడే ఆమూర్తుల రూపమున నొసంగుననియు గీతలలో చెప్పఁబడెను. ఆంజనేయ స్వరూపమునఁ దన్ను పూజించినవారికి శత్రుజయమును, సుబ్రహ్మణ్య స్వరూపమునఁ దన్ను పూజించినవారికి సంతాన ప్రాప్తి మున్నగునవియును భగవంతుఁడే అనుగ్రహించును. నిషాదరాజపుత్రుఁడగు ఏకలవ్యునకు విలువిద్యనేర్పుటకు ద్రోణుఁ డంగీకరింపలేదు. ద్రోణునే

గురువుగా భావించిన ఏకలవ్యుఁడు మట్టితో ద్రోణవిగ్రహమును చేసికొని మట్టి ద్రోణాచార్యుని వలన సమస్తధనుర్విద్యయు నేర్చికొనెను. మట్టివిగ్రహము జడమాత్రమే అయినచో దాని మూలమున అతనికి అంతటి విద్య ఎట్లు వచ్చెను ? ఏకలవ్యుని భక్తితాత్పర్య ప్రార్థన బలముల ననుసరించి భగవంతుఁడే మట్టి ద్రోణాచార్యుని రూపమున అతనికి ధనుర్విద్యాదానము చేసెను. ఆ విద్య భగవద్దత్తమగుటచేత ఏకలవ్యుఁడు ద్రోణాచార్య శిష్యులలో అగ్రగణ్యుఁడాయెను.

శ్రీ మూర్తిసేవచే అనన్య భక్తులకు కలిగెడి అనుభవములు

భగవద్విశ్వాసము, భక్తితాత్పర్యము, ప్రార్థన బలము పరాకాష్ఠస్థితినొంది ఎవని యందు గోచరించునో అతఁడు అనన్యభక్తుఁడగు చున్నాఁడు. భార్యాపుత్రుల యందును, గృహ ప్రాణులయందును, ఆప్త వర్గమునందును, ధనమందును, ఇహ లోక పరలోక భోగములందును గల మమకారమును పూర్తిగ విడిచినవాఁడే అనన్యభక్తుఁడు. ఇట్టి అనన్యభక్తులే తన హృదయమనియు, తాను వారల హృదయమనియు భగవంతుఁడు చెప్పియున్నాఁడు. ఇట్టిఅనన్యభక్తులకు ప్రపంచమందలి సమస్త భూతముల యందును భగవంతుఁడే గోచరించు చుండును. ఇఁక శ్రీమూర్తి దర్శనము వారికి లభించునపుడు దివ్యమంగళ స్వరూపుఁడగు భగవంతుని చిద్రూపదర్శనమే వారికి తన్మూలమున నగుటచే వారిహృదయము భక్తిపారవశ్యముచే ద్రవించును. వారిహృదయము భగవంతుఁడే అగుటచే అర్చా రూపము వహించిన భగవంతుఁడు తన స్తబ్ధత్వము, కాఠిన్యము విడిచి ద్రవీభూతుఁడై భక్తసులభుఁడగుచు దర్శన స్పర్శన

సంభాషణాదులచే తన భక్తుల ననుగ్రహించును. ప్రేమ సముద్రుండగు భగవంతుని యొక్క యిట్టి నిరంకుశ వర్తనము నకు ఉదాహరణములు పరమ భాగవతుల జీవిత చరిత్రములలో గననగును.

స్వయంవ్యక్తుండగు శ్రీకాళహస్తీశ్వరుని పూజనము తిన్నండను పేరు గల ఒక కిరాతకునికి లభించెను. అతండు సంసారము చేయుచున్నను మృగాదులను హింసించుచున్నను పరమశివుని యోగక్షేమములనే ప్రతిక్షణమును చింతించు చుండెడివాండు. మహాదేవునికి ఆంకలివేయుచున్నదనిమాంసము వండి రుచిగా ఉన్నదో లేదోయని చవిచూచి అతని కొసంగెడి వాండు. దేవునికి దప్పియగుచున్నదని తన నోంటినిండ నీరు తెచ్చి అతనిపై నుమియుచుండెడివాండు. ఈ విధముగ ప్రతిక్షణమును శ్రీ కాళహస్తీశ్వరుని చింతవమందును, సపర్యయందును అతండు వినియోగించు చుండెను. ఇతని నిష్కల్మష భక్తికి మెచ్చి ప్రేమమయుండగు భగవంతుండు ఒక కంటినుండి ఆనంద బాష్పములు రాల్చెను. అది చూచి అమాయకుండగు ఆ కిరాతుండు మహాదేవుని కంటికి రోగము వచ్చెనని భయపడి ఆరోగ్యస్థితియందున్న తనకంటిని ఒక అమ్ముతో నూండబెఱికి అది యా దేవునికి సమర్పించెను. ఆ కిరాతుని తదీయత, ఆత్మ సమర్పణబుద్ధి కని ప్రేమ వివశుండై ఆ పరమశివుండు తన రెండవ కంటినుండి ఆనందబాష్పములు రాల్చెను. అది చూచి ఆ వ్యాధుండు తన ప్రభువు రెండవ కంటికికూడ రోగము కలిగెనని భావించి తన రెండవకంటి నూండబెఱికి సమర్పింపంగోరెను. కాని తొందఱపడి యూండబెఱికినచో సరియైన స్థానమున దాని నమర్చుటకు తనకు కనుదృష్టియే

యుండదని తెలిసికొని తనకంటి నూడఁ జెఱుకుటకు ముందుగా తాను చిరకాలము దారి నడచి త్రొక్కిన తన కాలి చెప్పు నొకదానిని గుఱుతు కొఱకు పరమశివుని కను బొమల నడిమి చోటున నునిచెను. దాని నానుకొని ఆ వ్యాధుఁడు తనకంటి నూడఁ జెఱుకుచుండ ప్రేమమయుఁడును, భక్తవత్సలుఁడును అగు శ్రీకాళహస్తీశ్వరుఁడు పట్టరాని సంరంభముతో సపరివారుఁడై దర్శనమిచ్చి అతనికి కనుదృష్టికూడ నిచ్చి సర్వవిధముల ననుగ్రహించెను. దీనినే శ్రీ శంకరాచార్యులవారు బహురమ్యముగ వర్ణించిరి :— "మార్గావర్తిత పాదుకా పశుపతే రంగస్య కూర్చాయతే, గండూషాంబు నిషేచనం పురరిపో ర్దివ్యాభిషేకాయతే, కించిద్భక్షితమాంస శేష కబళం నవ్యోపహారాయతే, భక్తిః కిం నకరోత్యహో వనచరో భక్తావతంసాయతే."

నామదేవుఁడు, జ్ఞానదేవుఁడు అనెడిమహా భక్తాగ్రేసరులు ఒకప్పుడు సమస్తక్షేత్రములను దర్శించి శివరాత్రినాఁటికి పరమ శివక్షేత్రమగు నాగనాథపురమునకు విచ్చేసిరి. నాగనాథుని దేవాలయము జనముతో క్రిక్కిఱిసి యున్నను వారిరువురును ఎట్లో గర్భాలయము చొచ్చి అచట నిలువఁబడి మహాదేవుని గుణకీర్తనము చేయనారంభించిరి. నాగనాథస్వామి ప్రేమ పరవశుఁడై ఆ మనోహర గానమును వినుచుండెను. ఇంతలో ఆస్వామి యర్చకులు వచ్చి ఆ మహానుభావులయొక్క అనన్య భక్తి మహత్త్వము తెలియఁజాలక వారలను ఆలయము వెలుపలికి నెట్టివెచి ఆలయము వెనుక ప్రక్కకుఁబోయి గానము చేసికొనుఁడని ఆజ్ఞాపించిరి. వారు అట్లే పోయి ఒక రాత్రియు, పవలును భగవద్గుణగానము చేయుచు తన్మయులై

యుండిరి. వారియందును, వారి గానమునందును అమిత ప్రీతి గల శ్రీ నాగనాథస్వామి తూరుపు మొగముగనున్న తన దేవాలయమును పశ్చిమముఖ మొనర్చి తానును పశ్చిమాభి ముఖుడై ఆ మహాభక్తులకు అభిముఖముగ నిలిచి వారల గానము వినజొచ్చెను. సర్వశక్తిమంతుడును, నిరంకుశుడును, అగు భగవంతునికి ఏయ్యది అసాధ్యము ?

ఇక శ్రీరామకృష్ణ పరమహంస పూజించిన "రామ లాలా (బాలరామ)" విగ్రహము విషయము అంద తెలిగి నట్టిదే. అతనికి లభించిన ఆ లోహమయ రామ విగ్రహము నేడుకూడ కాళికామందిరమున ఉన్నది. ఆ విగ్రహమునందు శ్రీ పరమహంసకు కలిగిన అనుభవములు వినుటకు అద్భుతముగ నుండును. అతని వాక్యములనే ఒకటి రెండు క్రింద వ్రాయు చున్నాను:—

"మీారందఱు నా కెట్లు కనుపడుచున్నారో రామ లాలాకూడ నాకట్లే కనుపడుచుండెను. అతడొకమాఱు నా యెదుట చిందులు ద్రొక్కెను. ఒకమాఱు నావీపుపై కెక్కెను. ఒక మాఱు నన్నెత్తి కొమ్మనెను. * * * ఒక మాఱు నేను స్నానముచేయుటకు పోవుచుండగా రామలాలా నావెంట బడెను. నాతోపాటు అతడు కూడ స్నానము చేసెను కాని నే నెంత బతిమాలినను అతడు నీటినుండి బయటికి రాడయ్యె! నే నప్పుడు కోపము తెచ్చుకొని అతనిని నీటిలో అణగద్రొక్కి 'నీ యిష్టము చొప్పున ఆడుకొమ్మ' అంటిని. కాని పాపము! అతడు ఊపిరాడక నీటిలో గింజు కొనుచుండెను."

ఇట్టి శ్రీరామకృష్ణుని అనుభవములు మనకాలము నాటివే కదా? పై ఉదాహరణములను పట్టి అనన్యభక్తులకు అర్చామూర్తుల యందు భగవంతుని సాక్షాద్దర్శనమును, సాక్షాత్ స్పర్శనసంభాషణాదులును లభించునేకాని అర్చా నిర్మాణ ద్రవ్యములగు రాయి, కొయ్య, మట్టి మొదలగు వాని దర్శన మెంతమాత్రమును లభింపదని మనము ముఖ్యముగ జ్ఞప్తియందుంచు కొనవలెను.

**మానవసేవ మాధవసేవ యెప్పుడగును ?**

"భగవద్విశ్వాసము, భక్తి తత్పరత్వము, ప్రార్థన బలము మున్నగు సాధనలచే శ్రీ విగ్రహము లందును, జ్ఞాన, యోగ సాధనలచే మానవుల హృదయాంతరములందును భగవద్దర్శన లాభమును, తత్ఫలముగ భగవత్సేవయు,' భగవత్పూజనమును, భగవదనుగ్రహమును మనకుఁ గలుగుట నిజమేయందము. కాని ఆ సాధన కష్టమంతయు మనకేల? ప్రపంచమంతయు భగవత్స్వరూపమే కదా? 'అఖిలరూపముల్ తన రూపమైనవాఁడు' అని గజేంద్రుఁడు భగవంతుని ప్రార్థించెను కదా? కావున సకల భూతసేవ–ముఖ్యముగ మానవసేవ, మన మొనర్చినచో అదియే భగవంతునికి ప్రీతి గొలుపునట్టి భగవత్సేవ అగుచున్నది. తన బిడ్డలను ముద్దాడినపుడు తల్లి యెట్లు సంతోషించునో, సర్వభూత సేవ యొనర్చినప్పుడు భగవంతుఁడట్లే సంతోషించును. కనుకనే 'మానవసేవ మాధవసేవ' అను వాక్యము ప్రసిద్ధివడసినది. నదులుపొంగి నగరములు, జనపదములు మునిఁగి నప్పుడును, అగ్నిభయము, చోరభయము, రోగభయము, దుర్భిక్షము, భూకంపము మున్నగునవి కలిగి

నప్పుడును మానవులకు సంభవించెడి శారీరక మానసిక సామాజిక ప్రభృతికష్టములు మనము శక్తివంచన లేకుండఁ బొలగింపఁ గలుగుదుమేని అదియే భగవత్సేవయు, భగవదారాధనమును అగుచున్నది కావున నెట్టి సాధనతోడను మాకు పనిలేదు" అనునట్టి అభిప్రాయము మనలో ఎందఱికో కలదు. ఈ అభిప్రాయము ననుసరించి దేశమందు లెక్కలేని మానవసేవా సంఘములుకూడ స్థాపింపఁబడినవి. మానవుల సర్వకష్ట నివారణమే ఈ సంఘములు ముఖ్యాభిప్రాయము. వారు సర్వసోదర న్యాయము నుద్ఘాటింతురు. ఒక్క జీవాత్మయే తమయందును, సర్వమానవ కోటియందును అనుస్యూతమై యున్నదని వారు చెప్పుదురు. "మేము ఆచరణ పురుషులము. సాధనల గొడవలో వ్యర్థమగు కాలమంతయు మేము మానవసేవయందే వినియోగింతుము" అని గర్వోక్తిగ కూడ చెప్పుదురు. ఇదంతయు యుక్తి యుక్తముగనే తోఁచును. కాబట్టి యెట్టి సాధనయు నెఱుఁగని ఒక సేవా సంఘమువారు ఒకానొక యుద్ధ సందర్భమున ఒనర్చిన ఒక సేవావిషయము గుఱించి ముచ్చటించెదను.

రోగగ్రస్తులును, గాయములు తగిలినవారును గల "గూర్ఖా" పటాలమొకటి వైద్యశాలయందుఁ జేర్పఁబడెను. వైద్యశాఖకు సంబంధించిన ఒక సేవాసంఘమువారు వారికి ఉచితముగ చికిత్స చేయుటకు సంసిద్ధులైరి. నాలుగువందల మంది వైద్యులు, చికిత్సకులు, సాధకులుగల ఆ సేవాసంఘమునకు ఒక రాజపుత్ర వైద్యశిఖామణి నాయకుఁడై యుండెను. తన నాయకత్వము క్రింద నున్నవారి విషయమెట్లున్నను ఆ రాజపుత్రుఁడు బహుశాంతుఁడనియు, స్వపరభేదము లేనివాఁడనియు

సర్వాత్మ భావము కలవాఁడనియు గొప్ప ప్రసిద్ధి పొందెను. తన అనుచరులందఱును గూర్ఖా సైనికులకు చికిత్స చేయుచుండిరి. ఒక గూర్ఖా సైనికునికి కాలిలో రెండు తుపాకిగుండ్లు ప్రవేశించి అవి బయటికి రానికారణమున అచ్చట వ్రణమేర్పడెను. సంఘనాయకుఁడే వీనికి చికిత్సచేయ నారంభించెను. గూర్ఖా సైనికులు మిగుల మూర్ఖులని ప్రసిద్ధి. ఇతరులను హింసించుటలో వారలు వెనుకదీయరు. సంఘ నాయకుఁడగు రాజపుత్రుఁడు వాని వ్రణము శోధించుచుండగా వానికి అమిత బాధ కలిగి ఆ వైద్యుని చెంపపై నతఁడొక దెబ్బవైచెను. ఆదెబ్బ బలముచే రాజపుత్రుఁడు కొంచెము మూర్ఛనొందెను. కాని మిగుల శాంతముతోడనే ఆ గుండ్లను బయటికి దీసి కట్టుకట్టెను. రెండవ దినమున నతఁడు మఱల చికిత్సచేయుచుండగా తనకు బాధకలుగుటచే ఆ గూర్ఖా సైనికుఁడు మఱల నతని చెంపపై గట్టిదెబ్బ కొట్టెను. కాని యెట్లో సహించి అతఁడు చికిత్స చేసెను. మూఁడవ దినమున ఆ రాజపుత్ర వైద్యుఁడు వ్రణమును శోధించుచుండ ఆ గూర్ఖా సైనికుఁడు పిడుగువంటి దెబ్బ మఱల నతనిచెంపపై గొట్టెను. ఇంతవఱకు ఓర్చిన ఆ రాజపుత్రుఁడు శాంతమువీడి క్రోధపరవశుఁడై వ్రణబాధపడుచు మంచమెక్కియున్న ఆ గూర్ఖా సైనికుని నొక బలిష్ఠమగు చేతికఱ్ఱతో చితుకగొట్టెను.

రాజపుత్రుఁ డిట్లు వర్తించుటకుఁ గారణమేమి? తన సర్వ సోదరన్యాయము ఇపు డేమైనట్లు? తన ఆత్మయు, గూర్ఖా సైనికుని ఆత్మయు ఒక్కటే అనుమాట అతఁడేల మఱవవలసి వచ్చెను? చికిత్సా సమయమందు తనకు బాధ కలుగుటచే ఆ గూర్ఖా సైనికుఁడు తన్నుగొట్టిన మాట

వాస్తవమే. తానది సహింపలేక మఱల నతనిని కొట్టినపుడు తన సేవాసంఘ ప్రయోజన మేమైనట్లు? ఇంగులకుఁ గారణము స్పష్టముగనే ఉన్నది. మానవసేవ మాధవసేవగా చేయుటకు బయలుదేఱిన సంఘముల వారందఱును శోక మోహాదులలో మునిఁగి తేలుచున్న సాధారణ సంసారులు మాత్రమే. వీరికి ఇంద్రియ నిగ్రహ సాధనము, మనో నిగ్రహ సాధనము బొత్తుగా లేనందున వీరి అంతఃకరణములు విషయమాలిన్యముతో నిండి యుండును. ఈ విషయ మాలిన్యము రజోగుణమునకు సంబంధించినది. రజోగుణము ఎంతవఱకు పనిచేయుచుండునో అంతవఱకు సర్వభూత ముల యందును నానాత్వబుద్ధియును, స్వపరభేద జ్ఞాన మును ప్రతిమానవునికిని కలిగియే యుండునని భగవంతుఁడు గీతలలో చెప్పియున్నాఁడు. రజోగుణము నశించినగాని సత్త్వ వృద్ధి కలిగి సాత్త్వికజ్ఞానము వికసింపదు. సర్వభూతముల యందున్న తత్త్వము, అనఁగా, ఆత్మతత్త్వము ఒక్కటియు, అవిభక్తము, అవ్యయమునని ఏ జ్ఞానమువలన తెలియబడు చున్నదో అదే సాత్త్విక జ్ఞానము. ఇట్టి జ్ఞానము కలిగినప్పుడే మానవులందఱు మాధవ స్వరూపమున గాన్పింతురు. ఇట్టి జ్ఞానము రజస్సు నశించినప్పుడే కలుగును గనుక అంతఃకరణ మాలిన్యరూపమును, చిత్తచాంచల్య రూపమును అగు రజోగు ణము నశించుటకు యోగసూత్రములలో ఏకతత్త్వాభ్యాసము, అభిమతవస్తు ధ్యానము చెప్పఁబడెను. ఈ ఏకతత్త్వమును, అభిమతవస్తువును అర్చామూర్తి యైనప్పుడు భగవద్విశ్వాసము, భక్తి తాత్పర్యము, ప్రార్థనబలముకల భక్తుఁడు భగవంతుని

మొదటసరళా[గ్రే]షువులురాల్పగలిగినంతట అతని అంతఃకరణము శుద్ధియై అందతనికి భగవద్దర్శనము లభించునని యింతకుముందే చెప్పియున్నాను. అంతఃకరణశుద్ధిచే సత్త్వవృద్ధికలుగును. సత్త్వవృద్ధిగలభక్తుడు సమస్తభూతములయందును భగవంతుని గను చుండును. ఈ అంతఃకరణ శుద్ధికి గీతలయందు ఆరవఅధ్యాయమున "దుఃఖసంయోగ వియోగ" రూపమగు ఏ యోగాభ్యాసము చెప్పబడినదో నిగ్రహము, ఉద్యోగముగల మానవునకు అది ఆరునెలలలో సిద్ధించునని ఉపనిషత్తులయందును, మహాభారతమునందును చెప్పబడినది. "అనేన విధినా సమ్యఙ్నిత్యమభ్యస్యతే క్రమాత్, స్వయముత్పద్యతే జ్ఞానం త్రిభిర్మాసై ర్నసంశయః, చతుర్భిః పశ్యతే దేవాన్ పంచభిర్వితత క్రమాన్, ఇచ్ఛయాప్నోతి కైవల్యం షష్ఠేమాసి నసంశయః" అనగా విధ్యుక్తముగ యోగాభ్యాసము చేయువానికి మూడునెలలకు జ్ఞానోత్పత్తియు, నాలుగు నెలలకు దేవతా దర్శనమును, అయిదు నెలలకు యోగవృద్ధియు, ఆరు నెలలకు కైవల్యసిద్ధియు, నిస్సందేహముగ కలుగునని అమృతనాదోపనిషత్తు చెప్పుచున్నది. మహాభారతమందు అనుగీత పర్వములోకూడ షష్ఠమాస పరిమితియే చెప్పబడినది. ఇట్టి స్థితిలో ఆరునెలలు కాకపోయినను అంతకు తక్కువ కాలమైనను భక్తి సాధనచేసియో, గీతలలో చెప్పిన విధముగ యోగ సాధనచేసియో, అంతఃకరణశుద్ధిని సంపాదించని యెడల రజోగుణ ఫలితమగు తన-పర-భేదమునశించుటయు, సత్త్వగుణ ఫలితమగు సర్వాత్మభావము కలుగుటయు సంభవింపనేరదు. సాధనలో వృథాపోవుకాలము ఆచరణయందు వినియోగించి

సర్వసోదర న్యాయము ప్రకటింతుమని చెప్పు సాధారణ సంసారులు మన రాజపుత్ర వైద్యునివలెనే తమ రజఃప్రవృత్తికి సహజముగ వశులై మాధవసేవ చేయజాలకుండుట అట్లుండ, యథోచితముగనైన మానవసేవకూడ చేయజాలక తుదకు ప్రాణిహింసయే చేసిన వారగుచున్నారు. నిర్మలాంతః కరణమందుగాని ఆత్మదర్శనము, ఆత్మానుభవము, తత్ఫలమగు శాంతి స్థితియు లభింపనేరదు. సాధన ఫలముగ ఆత్మానుభవము కలిగిన వానికే సర్వభూతములయందు తానుచు, తనయందు సర్వభూతములును ఉన్నట్లు కనుపించుననియు, అట్టిస్థితి లభించిన వానినే ప్రాపంచికములగు ఎట్టి గొప్ప దుఃఖములు కూడ చలింపనేరవనియు, గీతలయందు జెప్పఁబడెను. రాజపుత్రవైద్యుఁడు తనకు గుర్ఖాసైనికుని వలన కలిగిన గొప్ప దుఃఖమును సహింపఁ జాలకుండుటకు కారణము రజఃప్రవృత్తిని ఏమాత్రమైన అణఁగించునట్టి ఎట్టిసాధనయు అతనికి లేకుండుటే కదా? కనుక "మానవసేవ మాధవసేవ" గా భావించెడి సేవాసంఘములవారికి తమచిత్త చాంచల్యమును తొలఁగించెడి సాధనము అత్యవసరమనియు, అట్టి సాధనము ఏ మాత్రమైన లేకుండ ఆచరణకు దిగుట లోకోద్వేగకారణమనియు, భక్తిమార్గమందు అర్చామూర్తి సేవనముచే భక్తుఁడు శాంతరజస్కుఁడగుట యోగసాధనకంటె మిగుల సులభమనియు ఇచ్చట నిరూపింపఁ బడుచున్నది. ఆధ్యాత్మికదృష్టియు, సాధనమును ఏమాత్రము కూడ లేని వారలు ప్రమాదరహితముగఁ ప్రపంచసేవగాని, భగవత్సేవగాని చేయఁజాలరని మనము ముఖ్యముగ జ్ఞప్తియందుంచుకొనవలెను.

దేవాలయ నిర్మాణ క్రమము.

ఇక దేవాలయ నిర్మాణ క్రమముగూర్చి కొంచెము ముచ్చటింతము. శరీరమను వృక్షమును జీవపక్షి, ఈశ్వరపక్షి అను రెండు పక్షులు సమానముగ నంటిపెట్టుకొని యున్నవనియు, అందు జీవపక్షి కర్మ ఫల మనుభవించుచుండు ననియు, ఈశ్వరపక్షి ఆ కర్మఫల మనుభవింపక స్వప్రకాశముతో నొప్పుచు వృక్షమును కేవల సాక్షిగ జూచుచుండు ననియు ముండకోపనిషత్తునందుఁ జెప్పఁబడినది. ఇంతేకాక, ఆ (సంసార) వృక్షమునందే సంచరించుచు జీవుఁడు స్వస్వరూపమును మఱచి దిక్కు తెలియని వాఁడై శోకించుచుండుననియు, తనకంటె వేఱుగ నున్న వాఁడును, తనకు సేవనీయుఁడును, అగు ఈశ్వరుని దర్శనము, అతని మాహాత్మ్య జ్ఞానము, తన కెప్పుడు లభించు చున్నదో అప్పుడు జీవునికి సంసార దుఃఖములన్నియు నశించుచున్నవని కూడ అందుఁ జెప్పఁబడినవి. మఱియు నందు జీవునికి దర్శనీయుఁడగు ఈశ్వరుఁడు బంగారు వర్ణముగల దివ్యమంగళ విగ్రహుఁడనియు, సర్వనియామకుఁడగు పురుషుఁడనియు చెప్పఁబడినది. ఇట్టి జీవేశ్వరులకు మన దేహమందలి హృదయ కోశమే స్థానము. జీవుఁడు నిర్మలమైన మనస్సునందు చిత్ప్రతిబింబ స్వరూపుఁడై యుండును. కావున జీవునికి ఆత్మదర్శనము చిన్మయమగు మనోదీపము చేతనే లభించును గాని యింద్రియముల మూలమున లభించునది కాదని మహాభారతమందుఁ జెప్పఁబడెను. చిత్స్వరూపుఁడగు ఈశ్వరునకు చిదాభాసుఁడగు జీవుఁడు సనాతనాంశగా గీతలయందుఁ జెప్పఁబడెను. కావున, ఈ చిన్మయ మనోదీపము అఖండమై దేవాలయములందు

భగవంతుని సన్నిధిని గోచరించుచున్నది. ఈశ్వరుఁడే శ్రీమూర్తియు, చిదాభాసుఁడగుజీవుఁడే అఖండదీపమునుఅగుచు హృదయకోశమను గర్భగృహమందు నివసించు చున్నారు. హృదయ కోశము తలక్రిందుగ నుండు తామర మొగ్గవలె నుండునని ఉపనిషత్తు వర్ణించినది. కావున దేవుని విమానము లన్నియు అట్లే నిర్మించుట వాడుకయైనది. జీవుని శరీరస్థానమున దేవాలయ ప్రాకారము నిర్మితమగు చున్నది. ఉపనిషత్తు జీవేశ్వరులను వేఱుగా వర్ణించినను పరమార్థదృష్టియందు వారిద్దఱును ఒక్కటే యగు ఆత్మతత్త్వ మగుచున్నారు. అఖండ దీప మాఱిన దేవాలయమును, జీవుఁడు వెడలిన దేహమును సమానములు. జీవుఁడు వెడలిన దేహమెట్లు అపరిశుద్ధమో, అఖండ దీపమాఱిన దేవాలయముకూడ అట్లు అపరిశుద్ధమై పునస్సంప్రోక్షణమునే కోరుచున్నది. నిద్రావస్థ యందలి జీవుఁడు ద్వైతబుద్ధిని విడిచి స్వస్వరూపము నొంది ఏకాకియై వెలుంగుచున్నపుడు అజ్ఞాన రూపమగు అంధకారము తననెట్లు ఆవరించి యుండునో అట్లే గర్భాలయము ముంగిట చీఁకటి ఆవరించి యుండును. ఇందుకనే భగవంతుని "ఆదిత్య వర్ణం తమసఃపరస్తాత్" ("చిమ్మచీఁకటి కవ్వల నెవ్వం డేకాకృతి వెలుఁగు.") అని ఉపనిషత్తు వర్ణించెను. జీవేశ్వరులు ఒకేతత్త్వమైనను వారిద్దఱిని వేఱు పఱచునది మాయా యవనికయే. కావుననే ఈశ్వరుని మాయాధీశునిగను, జీవుని మాయాధీనుని గను ఉపనిషత్తు వర్ణించెను. దీనిని నిరూపించుటకే దేవాలయము నందలి భగవన్మూర్తుల యెదుట తెఱవైచి యుంచుట వాడుక యయ్యెను. ఇఁక గర్భగృహము ముంగిట గంటయే ప్రణవము. ఘంటానాదమే ప్రణవనాదము. ప్రణవమే

ధనుస్సు అగుచుండ ప్రణవ (ఘంటా)నాదమొనర్చెడి జీవుడు బాణ స్వరూపుడగుచు గర్భాలయమందున్న పరమాత్మ యందే లక్ష్యముంచి అతనితో ఐక్యానుసంధానము కోరును. ఈ ఐక్యానుసంధానమే సమాధిలక్షణము. సమాధిస్థితియందే భగవద్దర్శనము లభించునని యింతకు ముందే చెప్పియున్నాను. జీవుడు తన్ను పరమాత్మతోఁ జేర్చు కాలమున తన శరీరము నెట్లు మఱచునో, అట్లే దేవాలయము లందలి అర్చామూర్తులను మంత్రములచేఁ బూజించు నర్చకుఁడు కూడ తన్మయుఁడై యుండినకాని అతఁడుచేయు నర్చనచే అర్చామూర్తుల మహత్త్వముయొక్క వృద్ధియు, ప్రకటనమును సంభవింప నేరదు. ఈ విషయ మింతకుముందే చెప్పఁబడినది. దీనిని పట్టిచూడ భగవత్సన్నిధానవర్తు లెంతటి సమాధినిష్ఠులై యుండవలెనో, భగవత్ప్రసాదమునకు, అనఁగా భగవదనుగ్రహమునకు వారలెట్లు అగ్రగణ్యు లగుచున్నారో స్పష్టమగుచున్నది కదా? దేవాలయము లందలి నేఁటికాలపు టర్చకుల యొక్కయు, సన్నిధి వారియొక్కయు శోచనీయ స్థితియు, తీర్థప్రసాదముల కొఱకు వారల దేవిరింపును, తగవులును, వారలచర్యలను కనుచున్న దేవాలయ ప్రేక్షకుల యీసడింపులును, పరిహాసములును చూచిన కొలఁది దేవాలయ తత్త్వజ్ఞులకు లజ్జయే కలుగుచుండును.

దేవాలయ కార్య నిర్వహణ రహస్యము

సర్వదేవాలయము లందుండెడి భగవంతుఁడు ఆత్మ తత్త్వమే యగుచు దేవాలయ కార్య నిర్వహణ మందు తటస్థుఁడై యుండును. భగవంతుని అహంకార స్వరూపమే దేవాలయ ధర్మాధికారి.

అతఁడు దేవాలయము తనదేయనునట్లు వ్యవహరించుచు దాని ఆదాయవ్యయములను పరిమాచుట కొఱకు మనస్సు అనెడి ఉద్యోగి నొకని నియమించును. కోరికలనెడి భక్తులు తెచ్చు ఉపాయనముల నందికొనుటకు ఆఉద్యోగి జ్ఞానేంద్రియములనెడి తన నౌకరుల నైదుగురను నియమించును. కర్మేంద్రియములనెడి నవుకరులు దేవాలయ ధర్మాధికారి యొక్క ఆజ్ఞా నిబంధనలను దేవాలయము వెలుపలి వారికి తెలియఁ జేసియు, ప్రపంచవ్యవహారముచేసి దేవాలయ నిర్వహణమునకుఁ గావలసిన ద్రవ్యములను నేకరించియును, దేవాలయ పరిశుభ్రత కొఱకు సదా పాటుపడుచుందురు. "దేహో దేవాలయః ప్రోక్తః" దేహమే దేవాలయమని చెప్పఁబడుచున్నదను దానికి ఇదియే అర్థము.

ఈ దేవాలయమునకు కొన్ని ప్రాకారములుకలవు. స్థూల శరీరమే బహిః ప్రాకారము. ఈప్రాకారమందు జ్ఞానేంద్రియములను సేవకు లైదుగురును దేవాలయద్వారము వద్దనిలిచి భక్తుల నుపాయనములలో లోనికిఁ బంపింతురు. మఱికొన్ని ద్వారములవద్ద కర్మేంద్రియము లైదును నిలిచి పైని చెప్పిన తమతమ కార్యములను నిర్వహించుచుందురు. సూక్ష్మదేహమను రెండవ ప్రాకారమును చేరుకొన్న కోరికలనెడి భక్తులు తమతమ ఉపాయనములను సమర్పించుచుందురు. కారణ శరీరమను మూఁడవ ప్రాకారమందు మనోఽహంకార స్వరూపులగు ధర్మాధికారియు, అతని చేతిక్రింది ఉద్యోగియు కార్యస్థానమేర్పఱచుకొని దేవాలయ కార్యనిర్వహణ మొనర్చుచుందురు. నాలుగవ అవస్థానమగు తురీయప్రదేశము గర్భాలయ మగుచు అందు భగవంతుఁడు భక్తజన కల్పవృక్షమై

సదా విరాజిల్లుచుండును. దశేంద్రియములును, మనోఽహంకృతులును ఎట్లు భగవచ్ఛక్తి నిఃసృతములో అట్లే దేవాలయ ధర్మాధికారియు, అతని పరివారమును భగవంతునితో అవినాభావ సంబంధము కలవారని తెలిసికొని తదను రూపముగ దేవాలయ కార్యనిర్వహణ మొనర్చి నప్పుడే ప్రత్యక్ష భగవద్జ్ఞానముగల ఋషులచే ఆదరింపఁబడి యుగముల తరబడి మన పవిత్రదేశమందు వెలయుచున్న దేవాలయ సంస్థ చరితార్థత నొందుచున్నది.

**శ్రీమూర్తి పూజనమునకు గురూపదేశ మావశ్యకము**

స్వయం వ్యక్తములే కానీ, ఋషిస్థాపితములే కాని అర్చామూర్తు లన్నియు భగవచ్ఛక్తి సంగతములై ~~భగ~~వత్ స్వరూపమునే నిరూపించుచున్నవి. భగవంతుఁడు నిరాకారుఁడై ఉండవలెను గాని సాకారుఁడై ఉండఁజాలఁడనుట సర్వశక్తిమంతుఁడు, నిరంకుశుఁడు నగు భగవంతునికి ఒకానొకశక్తిలోప మాపాదించినట్లే కదా? భగవంతుఁడు సచ్చిదానంద స్వరూపుఁడు. అట్టి స్వరూప విగ్రహుని అనంతగుణములలో అరూప (నిరాకార) లక్షణ మొకగుణముగా జెప్పుట సమంజసమగును. అట్టి చిన్మయస్వరూపుఁడగు భగవంతునికి మనము రూపము కల్పించుచుంటి మనుట హాస్యాస్పదము కదా ? అర్చావతారుఁడైన భగవంతుని అనుగ్రహము చేతను, సహజ సమాధిలో భగవద్దర్శనముచేసిన ఋషుల అనుగ్రహముచేతను మనకు లభించిన అర్చాపూజనము సాక్షాద్భగవత్పూజనమే అగుచున్నది. శ్రీ విగ్రహపూజనమునకు ఫలము మనకు చిన్మయదృష్టి కలుగుటయే. చిన్మయదృష్టి కలిగిన వెనుక శ్రీ

విగ్రహము భగవద్రూపమునే వహించుచున్నది కాని ప్రాకృత రూపముతో మఱి కనుపడదు. కావుననే భక్తాచార్యులు శ్రీ విగ్రహారాధన మంగీకరించి అది తమ శిష్యులకు ఉపదేశింతురు. వారికి ప్రథమోపదేశముగ ఆ విగ్రహములను దారు శిలామయములుగ భావింపరాదని నొక్కినొక్కి చెప్పుదురు. తన శిష్యులు చేయవలసిన పూజా విధానములను, ఉపాసనా విధానములను నిర్ణయించు నతఁడు గురువు. అట్టివి తమకు తామే శిష్యులు నిర్ణయించుకొనరాదు. అట్లుచేసినచో వారలు ఆత్మతత్త్వమును విడిచి తమ మనస్తత్త్వమునే అనుసరించిన వారగుచున్నారు; అనఁగా తమ యిష్టము వచ్చినట్లు చేయుచున్నారని అర్థము. అట్లు చేయుటచే వారు భగవంతుని పొందలేరు సరేకదా అతనికి మఱింత మఱింత దూరస్థులే అగుచు పౌత్తళికులును, పాషండుల్లును అగుచున్నారు. తనను భగవంతునితోఁ జేర్చుమార్గము నెఱిఁగియున్న సద్గురుని ఆశ్రయించుటమాని తమ మనస్సు నాశ్రయించి తనకు తానే గురువును, మార్గదర్శకుఁడును అగువానికి ఎన్నటికిని ఆత్మ వికాసము కలుగనేరదు. గురువుకూడ మనవంటివాడే అనుచు అతనియందు మానవబుద్ధిచేసి అతని నాశ్రయించుటకు ఇష్టములేనివారు తాము పూజించు శ్రీ విగ్రహములను కొయ్యలుగను, ఱాళ్ళుగను భావించుటలో ఏమి వింతగలదు? "అర్చ్యే విష్ణౌ శిలాధీర్గురుషు నరమతి ... ... యస్యవా నారకీ సః" అనఁగా భగవద్విగ్రహమును ఱాయిగా భావించు వానికిని, గురువును మానవమాత్రునిగ భావించువానికిని నరకప్రాప్తి కలుగుననునది ఋషివాక్యము.

శ్రీ విగ్రహము లెట్టివయ్యును అవి సాక్షాద్భగవన్మూర్తులగుటచేత వానిని ప్రతీకములనరాదు.

మూర్తిపూజ సర్వమానవ స్వభావ లక్షణము

ప్రతీకమనఁగా, అసలు వస్తువు (ఆత్మ తత్త్వము) ను మనవైపునకుఁ ద్రిప్పునదని అర్థము. ఉపాసన కొఱకు ఏదేనొక మాయికమైన వస్తువును ఉపయోగించుట నిరాకార బ్రహ్మోపాసకులకు సమ్మతమైన విషయమే. వారు ఆ మాయిక ప్రతీకమందు బ్రహ్మభావన ముంచుకొని బ్రహ్మను సంధానము చేయుదురుకాని బ్రహ్మతత్త్వము ప్రతీకముకంటె శ్రేష్ఠమైనదనియు, ప్రతీకము నామరూపమయమగు సృష్టి యందలి ఒక మాయిక పదార్థమే అనియు వారు సదా జ్ఞప్తియందుంచుకొందురు. భగవదుపాసకులు శ్రీ విగ్రహారాధనము చేయునప్పుడు బ్రహ్మోపాసకులు తమ ప్రతీకమందు మాయికబుద్ధి చేసినట్లు తమపూజామూర్తియందు మాయిక (శిలా) బుద్ధి చేయరు. "న ప్రతీకే నహిసః" "ఈ ప్రతీకములలో (పరమేశ్వరుఁడు) లేఁడు" అను వేదాంత సూత్రము అర్చామూర్తులందు భగవద్భావనగల భగవదుపాసకులకు అన్వయించునది కాదు. మూర్తిపూజ నంగీకరింపని బ్రహ్మోపాసకులే కాక బ్రహ్మ, క్రైస్తవ, మహమ్మదీయ మతావలంబులు సైతము తమ ఉపాస్యతత్త్వ చిహ్నమునో, ఆనవాలునో, ప్రతినిధినో ఉపయోగింతురు. ఏమన, సాధారణముగ సమస్తమైన వారికిని విగ్రహారాధనము ఉత్సాహకరమగు విషయమే. ప్రపంచమందు ఏదేశపు ప్రజలయందుఁ జూచినను విగ్రహారాధనము ఏదో ఒక రూపమునఁ గనఁబడుచునే ఉన్నదికాని బొత్తుగ లేకుండుట లేనేలేదు. హిందువులు సాలగ్రామములను, శ్రీవిగ్ర

హాములను బూజించినపుడు బౌద్ధులు బుద్ధవిగ్రహరూపములు మున్నగువాని నాదరించుచున్నారు. గ్రీకులును, రోమనులును జ్యూపిటరు(Jupiter)మున్నగు దేవతలవిగ్రహములను బూజించు చున్నారు. క్రైస్తవులలో రోమనుక్యాథలికులు మేరీ, జేసను విగ్రహములను బూజించుచుండ ప్రోటెస్టెంటులు "క్రాసులు" అనుపేరుగల శిలువలను బూజించుచున్నారు. మహమ్మదీయులు కూడ పంజాలను, చంద్రవంక(Crescent)లను బూజించు చున్నారు. వేయేల? విగ్రహారాధనమును నిరసించెడి కొందఱు విజ్ఞానవేత్తలు సైతము రూపరహితములును, బుద్ధిగ్రాహ్యము లును అగు స్వాతంత్ర్యము (Liberty), శాంతి (Peace), న్యాయము (Justice) మున్నగు విశిష్ట ధర్మములకు కూడ రూపములు (Statues) కల్పించి పూజించుచున్నారు. ధనికు లగు వారిలో నెవరైన చనిపోయినప్పుడు కొందఱు వారికి విగ్రహరూపము లిడి పూజించుచున్నారు. వారికిట్లేలచేయవలసి వచ్చెను ? చనిపోయినవారియెడలఁ దమకు గల కృతజ్ఞత మనస్సులో నుండిన చాలదా ? ఇంతటి వ్యాప్తితో విగ్రహా రాధనము లోకమందు నిత్య వర్తమాన మగుచుండుటకు కారణము విగ్రహములకంటె శ్రేష్ఠమగు ఈశ్వరభావనయో, దేవతాభావనయో, శిష్టధర్మభావనయో, గురుజనస్మరణమో విగ్రహముల మూలమునఁ జేయఁబడు చుండుటయే.

# IV

**పంచవిధ సేవాపరాధములు**

అర్చావతార ప్రయోజనమును, శ్రీ విగ్రహారాధన ప్రాశస్త్యమును పౌత్తళికతా లక్షణమును గుర్వనుగ్రహముచే నేను తెలిసికొని సంతవఱకు నిరూపించితిని. భగవద్భావముతో దేవాలయములందలి శ్రీ మూర్తులను దర్శించు నపుడును, సేవించునపుడును, మనమనేక విధములగు అపరాధములను చేయుచున్నాము. వానిని సేవాపరాధము లందురు. భక్తాచార్యులు వానిని అయిదు విధములుగ విభజించి యున్నారు. అవి ఏవన:

(1) సాధ్యమత యత్నాభావము (2) అవజ్ఞ (3) అపవిత్రత (4) నిష్ఠాఽభావము (5) సేవాకాలీన ద్రోహము.

శ్రీ విగ్రహ సేవా సందర్భమున చేయఁబడునట్టియు, శాస్త్రము లన్నిటి యందును ఉల్లేఖింపఁబడినట్టియు, అపరాధము లన్నియు పైనిఁజెప్పినరీతిగ పంచప్రకారములే అని నిరపఋుఁబడినవి. అపరాధముల నన్నిటిని వివరింపుట దుస్సాధము. ఏకొన్ని అపరాధములు పద్మ, వరాహపురాణాదులలో వివరింపఁబడినవో అవియే ఇచ్చట సంక్షిప్తముగ వివరింపఁబడును.

**(1) సాధ్యమత యత్నాభావము**

కావలసిన ద్రవ్యమున్నను శ్రీమూర్తి సంబంధములగు నియమితోత్సవములు చేయుకుండుట; సమర్థత యున్నను గౌణోపచారమూలమున పూజనము నిర్వర్తింపుట; ఆ యా కాలములందు దొరకు ద్రవ్యములను, ఫలములను ప్రయత్నపూర్వకముగ సంపాదించి భగ

వంతునికి అర్పింప కుండుట; ఉత్సవదినములలో దేవాలయము నకుఁ బోయియు భగవద్దర్శనము, భగవత్సేవనము చేయ కుండుట; భగవంతునికి స్తవము, వందనము, దండప్రణామము సమర్పింప కుండుట; దీపారాధనము చేయకుండ భగవన్మందిర మునఁ బ్రవేశించుట మున్నగు కార్యములన్నియు సాక్ష్యమత యత్నాభావమునుండి బయలు దేఱినవే.

(౨) అవజ్ఞ

వాహనము నెక్కియు, పాదుకలు తొడిగికొనియు, భగ వన్మందిరమునకుఁ బోవుట; శ్రీమూర్తి సన్నిధిని ప్రణామము చేయకుండుట; ఒంటిచేతితో ప్రణామము చేయుట; వ్రేలితో భగవన్మూర్తిని చూపించుట; శ్రీ విగ్రహము నెదుట ప్రదక్షిణము చేయుట, భగవంతునియెదుట కాళ్ళు చాఁపుకొని కూర్చుండుట; పర్యంకబంధములో కూర్చుండి భగవత్ స్తోత్రములు పఠించుట; శ్రీ విగ్రహము నెదుట పండు కొనుట; భగవత్ప్రసాదము వినా యితర ఖాద్యములను భగ వంతుని యెదుట తినుట, నములుట; బిగ్గఱగా మాట్లాడుట; ఒకరితో నొకరు సంభాషించుట; విషయాంతరములను స్మర ణకు తెచ్చుకొని యేడ్చుట; ఇతరులతో కలహించుట; అమంగళవాక్యములు, అశ్లీలములు పలుకుట; భగవంతుని యెదుట నవ్వుట, అధికారసూచకముగ నితరులయెడల నిగ్ర హానుగ్రహములు చూపుట; స్త్రీలతో వాక్కేళి సలుపుట; ఇతరులగుఱించి ప్రసంగించుట; అధోవాయు పరిత్యాగము; తెచ్చిన ద్రవ్యములలో అగ్రభాగము ఇతరులకిచ్చి అవశిష్ట భాగము భగవంతునికి నివేదింపుట; శ్రీమూర్తి వైపు వీఁపు ద్రిప్పి కూర్చుండుట; శ్రీ విగ్రహము నెదుట యితరులను

కైవారము చేయుట; భగవంతుని యెదుట ఏకాంతికి తప్ప యితర భక్తజనమునకుఁగాని, రాజునకుగాని, గురువునకుగాని, ఉపచారములు చేయుట; ఇతర దేవతల దర్శనము భగవద్దర్శనముతో సమానముగ భావించుట; శ్రీవిగ్రహదర్శన కాలమందు ఇతర క్షేత్రములు అధికతరమహత్త్వము కలవని వానిని నుతించుట; భగవదుపాలంభనము చేయుట; శ్రీమూర్తిని అకాలమున (భగవన్మందిర ద్వారము తెఱచియుండు కాలమునకు వ్యతీతమగు కాలమున) దర్శించుట; భగవత్పూజార్థము తేఁబడిన పుష్పఫల సుగంధద్రవ్యములను వాసన చూచుట; భగవత్సేవకొఱకు వచ్చిన భక్తితత్పరులగు పతితులను, హీనజాతులను దేవాలయపరిసరమందు తాఁకి స్నానము చేయుట; ఉత్సవకాలమందు అస్పృశ్యులను అనివార్యముగ తాఁకుచుంటిమనుచు స్నానముచేయుచుండుట; భగవత్ప్రసాదమును సామాన్యఖాద్యముగను, తీర్థమును సామాన్యజలముగను భావించివానినివిసర్జించుట; శ్రీమూర్తిదర్శనముచేసి భగవంతునికి పృష్ఠభాగము కనుపడునట్లు దేవాలయము నుండి వెడలివచ్చుట; శ్రీ విగ్రహపూజకై నిర్దేశింపఁబడిన ఏ ద్రవ్యములనైనను తమకొఱకు ఉపయోగించుకొనుట; భగవంతునికి నీరాజనమిడిన కర్పూరాదులను లోభగుణముచేత ఆర్పివేయుట మున్నగు కార్యములన్నియు సేవనమునకు సంబంధించిన అవజ్ఞలు.

ఎంగిలినోటితో గాని, చేతితో గాని, లేక వేరు విధ
ముగు అశుచిగల దేహముతోగాని భగ
(3) అపవిత్రత వన్మందిరమునఁ బ్రవేశించుట; పశు
రోమములతో నిర్మింపఁబడిన వస్త్ర
ములను ధరించి శ్రీ మూర్తిని సేవించుట; ఎట్టి వస్త్రముతో నైనను వక్షస్థలమును కప్పికొని పురుషులు భగవంతునికి నమస్కరించుట; అంగర్ఖా మున్నగు కుట్టినబట్టలు, ఉష్ణీషములు మున్నగునవి ధరించి భగవద్దర్శనము చేయుట; సువాసినులు మేలిముసుఁగులతో భగవన్మందిరమునఁ బ్రవేశించుట; పూజా సమయమున నిష్ఠీవనము విడుచుచుండుట; అగ్రవర్ణములవారు భగవదర్పిత పుష్పములను చెవులయందును, గంధమును కంఠమందును, తులసి కొప్పునందును ధరించుట; ఎముకలు, గోళ్ళు, వెండ్రుకలు మున్నగు అపవిత్రపదార్థములను దేవాలయమందు వేయుట; దేవాలయము నందును, తత్పరిసర ప్రదేశము లందును మలమూత్ర విసర్జనము చేయుట; అభ్యంజనమునకు తైలము పూసికొని దేవాలయమునఁ బ్రవేశించుట; భగవద్దర్శనమునకుఁ బోవుచు కుక్కలను వెంటదీసికొని పోవుట; కొమ్ములతోను, చర్మములతోను చేసిన వస్తువులను దేవాలయము లోనికిఁ గొనిపోవుట; భగవత్ప్రసాదము నారగించి తమ చేతులనుగాని, తినగా మిగిలిన పదార్థములనుగాని దేవాలయము గోడలకును, స్తంభములు మున్నగువానికిని రాచుట; మాదక ద్రవ్యములు సేవించిగాని, తాంబూల చర్వణముచేయుచుగాని, పొగద్రాగుచుగాని, దేవాలయమందు ప్రవేశించుట (ఈ పని చేయు మాదకద్రవ్యసేవకులకు పిశాచ జన్మయు, తాంబూలచర్వణులకు నెమరు వేయు పశువుల

జన్మయు, ధూమపాన ప్రియులకు కోటివిదయ్యముల జన్మయు కలుగునని శాస్త్రములు చెప్పుచున్నవి); పళ్ళు తోమకుండ శ్రీమూర్తి దర్శనము చేయుట; ఎఱ్ఱని రంగుగాని, నీలిరంగుగాని కలవస్త్రములు ధరించి భగవద్దర్శనమునకుఁ బోవుట; చీఁకటిలోను, నల్లవస్త్రము ధరించియు శ్రీమూర్తిని స్పృశించుట; సేవా సమయముల యందు ఇతర విషయములను చింతించుట మున్నగు అనేక అపవిత్రతా లక్షణములు నింద్యములుగ వర్ణింపఁబడినవి.

(4) నిష్ఠా ఽ భావము. భగవత్సేవకు పూర్వమే జలపానము చేయుట; నివేదింపఁబడని అన్నమును, జలమును ఆరగించుట: [illegible] భోజనము చేసివచ్చి భగవ దర్శనమునకు ఉపక్రమించుట; శ్రీమూర్తి సన్నిధిని వెలుఁగుచున్న దీపములకు స్వవినియోగము కొఱకు క్రొత్త దీపములు వెలిఁగించుట; లేక, ఆ దీపములనే తమ కార్యములకు ఉపయోగించుట, అన్య స్థలములకు గొనిపోవుట లేక ఆర్పివేయుట; శ్రీమూర్తి సన్నిధిని సాగుచున్న భక్తి ప్రసంగములను తాను వినకుండుట, ఇతరులను వినకుండ చేయుట; ఇతర దేవతలను పూజించుటకై ఉద్దేశింపఁబడిన పుష్పములతో భగవత్పూజన మొనర్చుట; భగవత్సేవా దర్శనములు నిత్యము చేయకుండుట; తనకు ప్రియమగు పదార్థములను, ఆయాకాలములందు దొరకు సుఖాద్య ఫలాదులను భగవంతునికి అర్పింప కుండుట; ఏకాదశినాఁడు ఉపవాసము చేయుకుండుట; — ఇవన్నియు నిష్ఠా ఽ భావములు.

సేవాకాలమందు తనన్ను అకించన భగవద్దాసునిగ జెప్పుకొనుట సర్వోత్తమము. అట్లు

(5) సేవా కాలీన గర్వము చేయక తాను గొప్పవాఁడననియు, తన పూజయే శ్రేష్ఠమగు పూజ అనియు, అభిమాన పూర్వకముగఁ జెప్పుటయే సేవాకాలీనమగు గర్వము. ఇంతేకాక శ్రీమూర్తియెదుట ఉన్నతాసనమున, గూర్చుండుట; భగవత్సన్నిధిని జరుగు నృత్యగీత వాద్యములను, పురాణ పఠనాది సత్కథా ప్రసంగములను తన సేవకు భంగకరములుగ భావించివానిని అధికారబలముచేత నిరోధించుట; తన వైభవ మంతయు ప్రకటించుటకై అనేక సామగ్రులతోడను, వివిధాడంబరముల తోడను శ్రీమూర్తిని సేవించుట కూడ గర్వమనఁబడుచున్నది.

ఈ యయిదు విధములగు సేవాపరాధములు చేయకుండ శ్రీమూర్తి సేవనము ఆచరింపవలెను. ఈ అపరాధములు విగ్రహ ప్రతిష్ఠాతలకును, అర్చకులకును, దేవాలయ ప్రేక్షకులగు సాధారణ భక్తజనులకును సంబంధించునవి.

లక్ష్మీ ప్రెస్, ఏలూరు,